# భక్తి భగవంతుడు



mohan
PUBLICATIONS
Mohanpublication.com
Granthanidhi.blogspot.in


ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం – 533 101.
Granthanidhi.blogspot.in

మలి ముద్రణ : జూలై, 1980

భక్తి - భగవంతుడు

# శ్రీ కాపు నాగేశ్వరరావుగారు

హెడ్ మాష్టరు, జిల్లా పరిషత్ హైస్కూలు

మకామ్ ఇంకొల్లు

చీరాల తాలూకా, ప్రకాశం జిల్లా

ద్రవ్యసహాయముతో

ఈ గ్రంథమును అచ్చువేయించడ మైనది.

## విషయసూచిక



శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ గణేశాయ నమః  శ్రీ సరస్వత్యై నమః

# భగవత్ప్రార్థన

శంభో ! శివశివ ! శివశివ ! శివశివ !

శంభో ! శివశివ ! శివశివ ! శివశివ !

శంభో ! శివశివ ! శివశివ ! శివశివ !

నారాయణ ! నారాయణ ! నారాయణ ! ఓమ్

ఈ ప్రార్థనను మన సద్గురు స్వాములవారు శిష్యులచే చేయించు చుందురను విషయ మందరకును తెలిసియే యున్నదిగదా !





ఈ ప్రార్థన నెందుకు శ్రీవారు యేర్పాటు చేసినారో, దీనిలోని భావమేమియో మనవారిలో ననేకులకు తెలియకనే యున్నది. శ్రీవారు కూడ దీనిని గురించి గ్రంథములలో వివరించి యుండలేదు.

ఈ ప్రార్థనను గురించి స్వాభిప్రాయమును వ్రాయుచున్నాను.

ఈ ప్రార్థన చేయువారికి శివుని యనుగ్రహమును, విష్ణుమూర్తి యొక్క యనుగ్రహమును కలుగుట కొరకును, శివకేశవులయెడ భక్తులకు భేదబుద్ధి లేకుండుట కొరకును శ్రీవారు ఏర్పాటు చేసియుండ వచ్చునని తలంచవచ్చును.

'జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్ మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్

తా. జ్ఞానమును ఈశ్వరుడు యిచ్చును, మోక్షమును విష్ణుమూర్తి గలిగించును అను ప్రమాణముండుటవలన శివకేశవులను భజించుట భక్తులకు శ్రేయోదాయకమే యగును. మరియు,

'శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయం శివః

శివునియొక్క హృదయము విష్ణువు హృదయమే ననియు, విష్ణువుయొక్క హృదయము శివుని హృదయమే ననియు శివకేశవులయొక్క అభేద తత్త్వమును నిరూపించిన ప్రమాణము లుండుటవలన శివకేశవుల నొక్కటిగా ప్రార్థించుట యుక్తమే యగును. భక్తులు శివకేశవాది భేదములతో భజించుచుందురు, జ్ఞానులన్నో సర్వత్ర పరబ్రహ్మ మొక్కటే గలదని సంభావించుచుందురు.

రాగద్వేషములు లేకుండగా యే దేవతనైనను పూర్ణవిశ్వాసముతో (ఏకాగ్రదృష్టితో) భజించుచున్నచో చివరకు సర్వపరిపూర్ణ పరబ్రహ్మమునే పొందగల్గుదురని అనుభవజ్ఞుల మతమై యున్నది.

ఆధ్యాత్మిక దుఃఖము (శరీర మానసిక బాధలు)
ఆధిభౌతిక దుఃఖము (ఇతరులవలన గలుగు బాధలు)
ఆధిదైవిక దుఃఖము (దేవతలవలన గలుగు బాధలు)

అను నీ మూడు విధములైన దుఃఖములు నశించుట కొఱకుగాని, సత్త్వరజస్తమోగుణ దోషములు పోవుటకొఱకుగాని, మలవిక్షేపావరణ దోషములు నివర్తించుట కొఱకుగాని, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయము లనెడి భేదములు నశించి ఒక్క జ్ఞేయాకారదృష్టి సుస్థిరమగుట కొఱకుగాని శివుని నామమును మూడేసి పర్యాయములును, నారాయణ నామమును ముమ్మారును పఠింపబడుచున్నదని నిశ్చయించుకొనవచ్చును.

## ఆహారనియమము - ఆరోగ్యసిద్ధి

మోక్షసాధనపరులకు ఆహారనియమము తప్పక యుండవలెను, దీనికి తోడుగా సహవాస నియమము, నివాస నియమము, దైవచింతనయును అత్యవసరమై యున్నవి. ఆహారముయొక్క బలముతోనే మానవుడు మంచిపనులనుగాని, చెడుపనులనుగాని చేయుచుండును, మంచి ఆహారమును భుజించుట వలన మంచి అణువులు యేర్పడును. చెడు



ఆహారము వలన చెడ్డ అణువులు యేర్పడును. ఆహార నియమము వలన దేహము ఆరోగ్యముగా నుండును. మనస్సు కూడ నిర్మలముగా, నిశ్చలముగా నుండును, గృహస్థులుగాని, సన్న్యాసులుగాని ఇతర మానవాది ప్రాణులకు బాధను, ద్రోహమును కలుగజేయక సంపాదింపబడిన ఆహారమునే భుజించవలెను, మధురము, పులుపు, కారము, చేదు, వగరును మితముగా భుజించుచుండవలెను. ఆకలిబాధ నివారణ కొఱకును, ఆరోగ్యముగా నుండుట కొఱకును భుజించుచుండవలెనేగాని రుచులకు లోబడిగాని, అధికమైన దేహబలము నొందవలెననిగాని భుజింపరాదు.

శ్లో. అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యం చాఽతిభోజనం
అపుణ్యం లోకవిద్వష్టం తస్మా త్తత్పరివర్జయేత్.

తా. అధికముగా భోజనము జేసినచో అనారోగ్యము గల్గును. ఆయువు క్షీణించి పోవును. స్వర్గసుఖము దూరమగును. పుణ్యము పోవును. ఇతడు తిండిబోతుయని ప్రజలచే నిందలుకూడ వచ్చును. కనుక పవిత్రజీవితమును పొందదలంచువారు అధికముగా ఆహారమును స్వీకరించరాదు.

శ్లో. ఏకభుక్తం సదాఽరోగ్యం ద్విభుక్తం రోగసంభవమ్
త్రిభుక్తం రోగపీడ్యంచ చాతుర్భుక్తంచ మృత్యుదమ్.

తా. ఒకపూట భోజనము చేసిన ఎల్లప్పుడును ఆరోగ్యముగా నుండును. రెండు పర్యాయములు భుజించినచో అపుడపుడు రోగములు వచ్చుచుండును. మూడు పర్యాయములు భుజించినచో ఎల్లప్పుడున్ను అనారోగ్యముతో బాధలు గలుగుచుండును. నాలుగు పర్యాయములు భుజించినచో తొందరగా చావు వచ్చును.

శ్లో. పూజితం హ్యశనం నిత్యం బలమూర్జం చ యచ్ఛతి
అపూజితంతు తద్భుక్త ముభయం నాశయేదిదమ్.

తా. అతిథులకు పెట్టగా మిగిలిన ఆహారము లేక భగవంతునకు నివేదనచేసి భుజించిన ఆహారము శరీరబలమును, మనోబలమును గలిగించును, దైవార్పితము చేయక భుజించిన ఆహారమన్ననో శరీరారోగ్యమును, మనశ్శాంతిని కూడ నశింపజేయును.

శ్లో. మౌనేన భోజయిత్వాతు స్వర్గం ప్రాప్తో నసంశయః
సజల్పం భుంజతేయస్తు తేనాన్న మశుచిర్భవేత్.
శ్లో. పాపంచ కేవలం భుక్తే తస్మాన్మౌనం సమాచరేత్
ఉపవాససమంభోజ్యం జ్ఞేయం మౌనేన నారద.

తా. మౌనముగా నుండి దైవచింతనతో భుజించినచో తప్పక స్వర్గసుఖము లభించును. అనవసర ప్రసంగములను చేయుచు భుజించి



నచో ఆ యన్నము మలినమైనది యగును, వ్యర్థమైనదైన, ప్రీతికరముగాని మాటలతో భుజింపబడుచున్న అన్నము అన్నముగాదు. అది పాపమే యగును. అందువలన మౌనముతో, దైవాత్మ చింతనతో భుజించుచుండవలెను. దైవధ్యానములో నుండి భుజించినవారు ఉపవాసవ్రతములో నున్నవారితో సమాను లనబడుదురని తెలిసికొనవలెను.

అన్నము అనగా మనము తినుచున్న పదార్థము లగును. అనగా పాలు, పండ్లు, ధాన్యములు, ఔషధములున్ను అన్నము అను శబ్దమునకు వర్తించును. కొన్నిరకములైన పదార్థములను భుజించుట వలన మనకు అనారోగ్యము గలుగును. మఱికొన్నిరకములైన పదార్థములను భుజించుటవలన మనలో గల వ్యాధులు నశించుచుండును. పదార్థము లన్నియును భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము నను పంచమహాభూతములయొక్క కలయికల వలన యేర్పడుచుండును. షడ్రసములున్ను పంచమహాభూతముల వలన యేర్పడిన విధమును తెలిపెదను. ఇదొక శాస్త్రములోని భాగము.

(1) మధురము : భూమి, జలము వలన గలిగినవి.
(2) పులుపు : భూమి, అగ్నివలన యేర్పడినది.
(3) ఉప్పు : అగ్ని, జలము వలన గలిగినది.
(4) కారము : వాయువు, అగ్నివలన ఏర్పడెను.

(5) చేదు : వాయువు, ఆకాశము వలన గలిగెను.

(6) వగరు : భూమి, వాయువు వలన ఉత్పన్నమయ్యెను.

పంచమహాభూతముల వలన నిర్మింపబడిన మనశరీరములో వాతము, పిత్తము, శ్లేష్మము నను మూడుదోషములు గలవు. ఆ మూడింటిలో నేదైనను అధికమైనపుడు మనకు అనారోగ్యము గలుగును. కలిగిన అనారోగ్యమును ఆహారపదార్థములతోనే రహితము చేసికొనవలెను. అదెట్లనగా,

"మధురామ్లలవణాః వాతఘ్నాః"

బెల్లము, పులుపు, ఉప్పున్ను వాతపు దోషమును హరించును. కనుక మలబద్ధము, కాళ్ళు, చేతులు, నడుము మొదలైన భాగములు నొప్పులుగలుగుట యను వాతపు దోషములు బాధించినపుడు బెల్లము, పులుపు, ఉప్పుతో నివారణ చేసికొనవలెను.

"మధుర తిక్త కషాయాః పిత్తఘ్నాః"

తీపు, చేదు, వగరు—యివి పైత్యపు దోషమును నివారించును.

"కటు తిక్త కషాయాః శ్లేష్మఘ్నాః"

కారము, చేదు, వగరున్ను శ్లేష్మదోషమును (అధికశీతలమును) హరింపజేయును.

ఆసనములు వేయుటచేతను, ప్రాణాయామము చేయుటచేతను, ఉపవాసములు చేయుటచేతను కూడా వ్యాధులు నివారింపబడుచుండును.



మామిడిపండు పిందెగా యున్నప్పుడు వగరుగా నుండును. పెద్దదగుచున్న కొలదీ పులుపుగా మారును. పండిన తరువాత మధురముగా మారును.

ఇట్లే మానవులు కూడ మొదట కొంతకాలము తమోగుణముతో నుందురు. తరువాత రాజసగుణములతో ప్రవర్తింతురు. తరువాత సాత్త్వికస్వభావ మలవడును. బ్రహ్మనిష్ఠాభ్యాసముతో త్రిగుణములను అతిక్రమించి కైవల్యసుఖము నొందుదురు. అందువలన తామసాహారములను వదలి రాజసాహారములను భుజించవలెను. మరల రాజసాహారములను త్యజించి సాత్త్వికాహారమును సేవించుచు, పరమాత్మ ధ్యానము జేయుచు బ్రహ్మజ్ఞానవంతుడై ప్రకాశించుచుండవలెను.

భుజింపబడిన ఆహారమును దుష్టసంకల్ప ధ్యానములతోను, దుష్టమైన వ్యర్థమైన మాటలతోను, దుష్టమైన, వ్యర్థమైన పనులతోను జీర్ణము జేసికొనినచో లోకమునకు మనము శత్రువులము, ఋణస్థులము నగుదుము.

ఆహారబలముతో మనము లోకానుగ్రహమును, పెద్దలకృపను, శివరామకృష్ణాది దేవతల యనుగ్రహమును, పరబ్రహ్మ సాక్షాత్కార జ్ఞానభాగ్యమును సంపాదింప జేయునట్టి పనులను మనోవాక్కాయేంద్రియాదుల ద్వారా చేయుచుండవలెను.

ఆహారబలముతో తల్లిదండ్రులకు, కులమునకు, గ్రామమునకు, స్వదేహమునకు నేర్చిన విద్యకు, గురువులకును అపకీర్తి గలుగు పనులను చేయక నుండవలెను.

ఆహారములోనే అన్నిదోషములున్ను గలవని కబీరుదాసుగారు చెప్పెను

" తులము యెత్తు నాలుకకు తొంభై తొమ్మిది రుచు లెందుకు ?" యని గాంధీజీ చెప్పెను. " భుక్తిప్రియులు ముక్తికి దూరులగుదు"రని శ్రీ మలయాళ సద్గురువు సెలవిచ్చెను.

## ఆహార దోష నివారణోపాయము

శ్లో. కబళే కబళే కుర్వన్ రామ నామానుకీర్తనమ్
యః కశ్చిత్పురుషోఽశ్నాతి సోఽన్నదోషై ర్నలిప్యతే.

శ్లో. సిక్థే సిక్థే లభేన్మర్త్యో మహాయజ్ఞాదికం ఫలమ్
యస్స్మరే ద్రామనామాఖ్యం మంత్రరాజమనుత్తమమ్.

తా. ఏ మానవుడు ముద్దముద్దకును భగవన్నామమును స్మరించుచు భుజించుచుండునో, ఆ మానవుడు అన్నములో నేమైన దోషమున్నను దానిచే అంటబడడు.

భగవన్నామమును స్మరించుచు భుజించుచున్న మానవులు ప్రతి మెతుకునకును మహాయజ్ఞ ఫలమును పొందుచుందురు.



శ్లో. అన్నంబ్రహ్మ రసోవిష్ణుః భోక్తా దేవో మహేశ్వరః
ఏవం ధ్యాత్వానరో భుంక్తే అన్నదోషో నలిప్యతే.

తా. అన్నము బ్రహ్మస్వరూపమనియును, రసము విష్ణుస్వరూపమనియును, భుజించువాడు మహేశ్వరుడనియును సంభావించుచు (ధ్యానము చేయుచు) భుజించుచుండు మానవుడు అన్నదోషముచేత అంటబడడు.

పరమభక్తురాలైన మీరాబాయిచే తల్లిదండ్రులు విషమును త్రాగించినను మీరాబాయి కా దోషము అంటలేదు. ఇట్లే భక్త రఘునాధదాసునకు అత్తగారు విషమును పెట్టినను ఆయన ప్రాణమునకు హాని గలుగలేదు. ఇట్లే సిద్ధపురుషుడైన సత్యసాయీబాబాగారికి అసూయాపరులు విషముకలిపి ఫలహారమును పెట్టినను ఆ మహామహునకు ప్రమాదము సంభవించలేదు.

## విశిష్టాహారము

" ఇంద్రియైః విషయగ్రహణ మాహారః " ఇంద్రియములు వాటికి సంబంధించిన దృశ్యవిషయములను గ్రహించుట ( కోరుట ) ఆహారమనబడును.

ఆహారమనగా ఇంద్రియములకు సంతోషమును గలిగించునట్టి బాహ్యవిషయయులతో సంబంధమును పెట్టుకొనుట యగును.

(1) శబ్దాహారము : తమోగుణస్థులకు జూదము, పానము, వ్యభిచారము, దొంగతనము, హింస మొదలైన చెడువిషయములను విని సంతోషించుట శబ్దాహారము అనబడును.

రజోగుణస్థులకు ధన, ధాన్య, భార్యా, పుత్ర, మిత్ర, బంధు, వస్తు, వాహనాది విషయములను విని సంతసించుట శబ్దాహారము.

సత్త్వగుణస్థులకు సత్య, ధర్మ, శమ, దమ, క్షాంతి, వైరాగ్యాది భక్తిజ్ఞాన విషయములను, భగవంతునియొక్కయు, మహాత్ముల యొక్కయు మహిమాన్విత చరిత్ర విశేషములను విని ఆనందమొందుచుండుట శబ్దాహార మనబడును.

(2) స్పర్శాహారము : తామసులు చెడువస్తువులను (చెడ్డ పనులను) తాకి సంతసింతురు. రాజసులు భోగ్యవస్తువులను (వినోదకరమైన పనులను) తాకి సంతసించెదరు. సాత్త్వికులు పూజ్యవస్తువులను, దేవతలను తాకి సంతసించెదరు. ఇది స్పర్శాహారము.

(3) రూపాహారము : తామసులు చెడురూపములను, రాజసులు భోగ్యమైన, వినోదకరమైన రూపములను, సాత్త్వికులు పెద్దలను, దేవతలను, పుణ్యకార్యములను, సద్గ్రంథాది పూజ్యవస్తువులను చూచి ఆనందించుట రూపాహారమనబడును.



(4) రసాహారము : తామసులు అన్యాయార్జిత పదార్థములను, మత్స్యమాంసాది నీచాహారములను భుజించుటయు, రాజసులు మిక్కిలి విలువగల పాలు, పండ్లు, వడలు, పాయసము, కేసరి, మైసూరుపాకము, మిఠాయి మొదలైన వాటిని భుజించుటయు, సాత్త్వికులు న్యాయార్జితమైనది, గురుదైవములకు సమర్పింపబడినది, మనశ్శాంతిని, ధర్మజ్ఞానములను వృద్ధిపరచునదియు, భగవద్ధ్యానమునకు అనుకూలమును గలిగించునట్టిదియు నగు మితాహారమును భుజించుట రసాహారమనబడును.

(5) గంధాహారము : తామసులు వ్యాధులను, దుర్గుణములను వృద్ధిపరచునట్టి వాసనలను చూచుటయు; రాజసులు అత్తరు, పన్నీరు మొదలైన సువాసనలను వాసన చూచుటయు; సాత్త్వికులు గురుదైవములకు అర్పింపబడిన తులసీదళాదులను, యోగధారణచే యేర్పడిన సుగంధమును వాసన చూచుచుండుటయు గంధాహార మనబడును.

భగవన్నామ సంకీర్తన, స్మరణ (జపము), ధ్యాన సమాధుల యొక్క దివ్యామృతమును పానముజేయువారికి పైజెప్పబడిన పంచవిధ ఆహారములపై ప్రీతియుండదు.

సాత్త్వికులు, రాజసులు, తామసులు వారివారికి ప్రియమైన పంచవిధ ఆహారములను అనుభవించుట కొఱకు ఎంతో శ్రమపడి,

ఎంతో ధనమును ఖర్చుపెట్టి సంపాదించుకొనుచుండుట మనము చూచుచునేయున్నాముగదా ! సాత్త్వికులు పుణ్యము నొందుదురు. తామసులు పాపము నొందుదురు. రాజసులు మిశ్రకర్మమును (పుణ్య పాపములను) పొందెదరు.

శ్లో. వినిషిధ్యాఖిలం దృశ్యం స్వస్వరూపేణ యా స్థితిః
సా సంధ్యా తదనుష్ఠానం తద్దానం తద్ధి భోజనమ్.

తా. సమస్త ప్రపంచ విషయ సంకల్పములను (భ్రాంతులను) వదలిపెట్టి మన నిజస్వరూపమైన పరమాత్మ స్థితియందుండుట యేది గలదో అదే సంధ్య. అదే అనుష్ఠానము. అదే దానము. అదే నిజమైన భోజనము నగును. (శ్రీ శంకరాచార్యులు)

"అద్వైతభావనా భైక్ష్య మభక్ష్యం ద్వైత భావనమ్"

తా. అద్వైత భావమునే (ముముక్షువులు) భుజించుచుండ వలెను. నీవు-నేను; నాది-నీది; సుఖము-దుఃఖము యనెడి ద్వైత (భేద) భావమును భుజించకూడదు. (మైత్రేయ్యుపనిషత్తు)

కామ క్రోధ భయాది దుఃఖము లన్నియును భేదదృష్టిలోనే గలవు. అభేదదృష్టిలోనే శాశ్వతమైన పరబ్రహ్మానందము కలదు.

పామరులు ప్రపంచ విషయములను భుజింతురు. భక్తులు దైవభావమును భుజించెదరు. జ్ఞానులు స్వస్వరూపానందమును భుజించుచుందురు.



భక్తులు అన్నము లేకుండ కొన్నిదినములైనను ఉండగలరు గాని భగవద్ధ్యానములేకుండ ఒక్కపూటయైనను ఉండలేరు.

భగవన్నామసంకీర్తన, జప ధ్యానములను చేయుచున్నచో శరీరములలోని పాపదోషములు నశించి ఆరోగ్యము సిద్ధించును.

"ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్"

సూర్యభగవానునికి భక్తితో ప్రతిదినమును నమస్కారములు చేయుటచేతకూడ ఆరోగ్య భాగ్యము సిద్ధించును. ఓమ్.

యుక్తాహారము, వివిక్త (యేకాంత) వాసము, బ్రహ్మ చింతనము అను యీ రత్నత్రయమును శరీరపతన పర్యన్తము విడువ రాదు.

— మహర్షి శ్రీ సద్గురు మలయాళస్వాములవారు

## భగవన్నామస్మరణ - మోక్షమార్గము

శ్లో. మాంచయోఽ వ్యభిచారేణ భక్తియోగేన సేవతే
సగుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

ఎల్లప్పుడు భగవన్నామమును భక్తితో స్మరించుచున్నవారు క్రమముగా తమోగుణమును, రజోగుణమును, సత్త్వగుణమును దాటి శాశ్వతమైన మోక్షసుఖము నొందుటకు అర్హులగుదురు.

అన్ని మతస్థులకును శాశ్వతమైన సుఖస్థానము నిర్గుణ పరమాత్మయగును. నిర్గుణ దైవము నొందనంత వరకును మతాభిమానముతోను, కలహములతోను యుందురు.

మోక్షసాధనలతో భగవన్నామస్మరణ శ్రేష్ఠమైన, సులభమైన ఉపాయమని చెప్పక తప్పదు. ప్రపంచ నామరూపాలనుగాని, ఇతర దేవతలను మతములనుగాని లెక్కపెట్టుకొనుచు కాలక్షేపము చేయక తమ ఇష్టదైవమునందే పూర్ణవిశ్వాసముతోను, ఏకాగ్రచిత్తముతోను భజించు మానవులే త్వరలో మోక్ష సుఖము నొందుదురు.

శ్లో. సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః.

శత్రువులు బాధించుచున్నప్పుడును, మిత్రులు ఉపకారము చేయుచున్నప్పుడును 'శ్రీరామ శ్రీరామ' యని స్మరించుచునే యుండవలెను. ఇతరులు గౌరవించుచున్నను, అగౌరవించుచున్నను 'శ్రీరామ శ్రీరామ' యని యనుకొనుచునే యుండవలెను, చలిబాధ, ఎండబాధ, రోగబాధ మొదలైన ఎన్ని బాధలు వచ్చినను ఓర్పుతోగాని, నిస్సంగులైగాని శ్రీరాముని భజించుచునే యుండవలెను.

భగవన్నామస్మరణ ఎల్లప్పుడును చేయుచున్నచో సాకారముగా కనబడుచున్న నామ రూప ప్రపంచము క్రమక్రమముగా నిరాకారబ్రహ్మముగా కనబడును.



భగవన్నామస్మరణతో సదా ఆనంద మనుభవించ గలుగువారికి గీతాపారాయణతోను, పూజతోను, గురూపదేశములతోను సంబంధమును పెట్టుకొనకపోయినను మోక్షసుఖము గల్గును.

దైవస్మరణానందములోనున్న పుణ్యాత్ములు మంచివారిలో మంచిని వర్ణించరు. చెడ్డవారిలో చెడును వర్ణించరు. మంచి చెడ్డలను వర్ణించుకొనుచున్న వారికి రాగద్వేషాదులు గల్గునేగాని దైవామృతానందము గలుగదు.

ఈరోజులలో గృహస్థులకంటె మతనివాసులకే, సాధువులకే, సన్యాసులకే ఎక్కువగా రాగద్వేషములు, ఈర్ష్యాసూయలు, నీవు నేనను భేదబుద్ధులు, అశాంతి, తరంగ కల్లోలములున్ను కనబడుచున్నవి.

మంచిప్రవర్తనలతోను, మంచిగుణములతోను దేహమును పోషించుకొనుచు దైవచింతన ( ఆత్మచింతన ) తో మోక్ష సుఖమును పోషించుకొనుచు నుండవలెను. మంచి చెడ్డలు అన్నిస్థలములలోను గలవు. గాన మంచి చెడ్డలలోను పరమాత్మను గాంచి ఆనందించవలెనన్నచో సదా దైవచింతన విడువకయున్న మాత్రమే సాధ్యపడును.

మనలోగల నామ రూప ప్రపంచమే వెలుపలనున్న ప్రపంచవృత్తులకు హేతు వగుచున్నది. దృఢవిశ్వాసముతో దైవస్మరణ చేయువారికి మాత్రమే తమలోగల ప్రపంచము నశించును.

జ్ఞానవిచారణవలన ప్రపంచము అనిత్యమైనదనియు, బ్రహ్మమే సత్యమైనదనియును తెలియును. భక్తివలన ప్రపంచమును వదలి పరమాత్మను విడువక పట్టుకొను శక్తిగల్గును. పరమాత్మను మరచిన వేదాంతులందరును వాచావేదాంతులే యనబడుదురు. వాచావేదాంతులకు ధనాదివస్తువులపై, విషయభోగములపై, కీర్తిప్రతిష్ఠలపై, శిష్యుల సమకూర్చుకొనుటయందును తప్పక ప్రీతియుండును.

దైవస్మరణ దైవసుఖమును, గౌరవమును, శరీరసౌఖ్యమును సమకూర్చును. ధనవంతులైనను, దరిద్రులైనను, రోగులైనను, భోగులైనను, బంగారపు సింహాసనముపై కూర్చున్నవారైనను, మట్టిదుమ్ములో కూర్చున్నవారైనను, సంసారులైనను, సన్న్యాసులైనను, స్త్రీలైనను, పురుషులైనను, పండితులైనను, నిరక్షరకుక్షులైనను అనన్యభావములతో భగవంతుని స్మరించకయున్నచో సౌఖ్యము నొందజాలరు.

మానవులతో ఎక్కువగా మాట్లాడకుడు. అంతట నిండియున్న దేవునితోనే మాట్లాడుచుండుడు. మానవసహాయము కంటె ఎన్నోరెట్లు దైవసహాయము గొప్పదని అనుభవపూర్వకముగా గుర్తింపుడు.

అనన్యభక్తితో భక్తులును, అద్వయభావనతో జ్ఞానయోగులును ముక్తి నొందుదురు.





## మీకు దైవస్మరణ అమృతముగా నుంటే నాకు విషముగా నుంటున్న దేమి ?

ప్రశ్న : స్వామీ! నేను తెలుగు పండితుడను. భగవద్గీతాది గ్రంథములను చదివియుంటిని. తమవంటివారు భగవన్నామసంకీర్తన స్మరణలతో, సాకార భగవద్దర్శనములతో నెంతో యానందము నొందుచున్నారు. నాకు భగవన్నామస్మరణ చేయుట యనిన మహాభారమైనపనిగాను, అయిష్టముగాను యుంటున్నది.

ఈమధ్య నేను తిరుపతి క్షేత్రమునకు వెళ్లవలసి వచ్చుటచేత వెళ్లితిని. శ్రీ వేంకటేశ్వరస్వామిని నేను రాయిగా భావించ గలిగితినే గాని దేవునిగా భావించి నమస్కారము చేయజాలకపోతిని. అనేకులు వచ్చి దర్శించి నమస్కారములు చేయుచుండుట వలన యిందులో నేదైన మహత్త్వముండవచ్చునను భావముతో మాత్రమే నేనుకూడ నమస్కారము జేసితిని. మీకు దైవసంబంధమైన క్రియలు అమృతముగా నుండుటకును, నాకు విషముగా నుండుటకును కారణమేమి ?

ఉత్తరము : సోదరా ! నీలో మల విక్షేప ఆవరణ దోషములు అధికముగా యున్నవి. అందువలన తమోగుణ రజోగుణ సంబంధములైన ఇంద్రియ విషయములే రుచిగా నుండునుగాని సత్త్వగుణ సంబంధమైన సత్క్రియలు నీకు రుచిగా కనబడవు. సజ్జన

సాంగత్యము చేసినంత మాత్రముననే నీలో గల రజస్తమోగుణముల యొక్క అతిశయము తగ్గుచుండును.

ఇప్పుడు భాగవతములోని ఒక పద్యము చెప్పెదను. దీనివల్ల నీ సంశయము నిశ్శేషముగా తీరగలదు.

సీ. కామ హర్షాది సం - కలితమై చిత్తంబు
భవదీయ చింతన - పదవి సొరదు
మధురాది రసముల - మరగి చొక్కుచు జిహ్వ
నీ వర్ణనమునకు - నిగుడనీదు
సుందరీ ముఖముల - జూడ గోరుచు జూడ్కి
తావకాకృతులపై - దగులవడదు
వివిధ దుర్భాషలు - వినగోరు వీనులు
వినవు యుష్మత్కథా - విరచనములు

తే. ఘ్రాణ మురవడి దిరుగు దుర్గంధములకు
దవులు గొలుపదు వైష్ణవ ధర్మములకు
నడగియుండవు కర్మేంద్రియములు పురుష
గలచు సవతులు గృహమేధి గలచునట్లు.

తా. కామ సంతోషాదులతో కూడియున్న మనస్సు భగవత్స్మరణ ధ్యానములందు నిలచి ఆనందించుటకు ప్రవేశించదు. తీపి,



పులుపు మొదలగు షడ్రసములకు అలవాటుపడి మైమరచియుండు నాలుక సర్వేశ్వరునియొక్క శౌర్య సుగుణ లీలాది అత్యద్భుత విశేషములను స్తుతించుటకు ( సాగనీయదు ) యిష్టపడదు. సుందరమైన స్త్రీలయొక్క ముఖాది యవయవములను చూచుటయందు యాసక్తి గల నేత్రములు భగవానుని దివ్యమంగళ విగ్రహమును చూడవలెనను ప్రీతి గలిగియుండవు. పలురకములైన చెడువాక్యములను, వినోదకరమైన శబ్దములను వినుటయందు ఆసక్తిగల చెవులు భగవంతునియొక్క దివ్యకథలను ( భగవన్నామ సంకీర్తనలను ) వినుటకు యిష్టపడవు. మోహమును వృద్ధిజేయు వాసనలను ముక్కు కోరుచుండునేగాని భగవంతునికి సమర్పింపబడిన తులసీదళాదులను వాసన చూచుటకు ప్రసరించదు.

ఇట్లే కర్మేంద్రియములగు వాక్కు, చేతులు, పాదములు, గుదము, గుహ్యమును భగవంతునకును, పెద్దలకును ప్రియము గలుగునట్లు నడువక బాధలను, అశాంతియును గలుగునట్లు వర్తించుచుండును.

తీవ్రముగా నున్న శరీరములోని జ్వరము తగ్గనంతవఱకును క్షీరాన్నము అరుచిగా నుండునట్లు ఇంద్రియ విషయ భోగములపై గల అధికప్రీతి తగ్గనంతవఱకును వైరాగ్యధర్మము, భక్తిమార్గము, జ్ఞానవిచారణలను అయిష్టముగా, అరుచిగా, భారమైనవిగా, క్లేశదాయకములుగా గోచరించుచుండును.

ఇదివఱకు అనేకవిధములైన పుణ్యకార్యములను చేసినవారికి మాత్రమే యిప్పుడు భగవంతునిపై భక్తి గలిగి దైవామృతమును జూఱగొను భాగ్యము కలుగును. ఇప్పుడు దైవభక్తిలేనివారు పశ్చాత్తాపముతో "ఓ భగవంతుడా! ఓ జగదీశ్వరా! ఓ భక్తవత్సలా! ఓ దయామయా! నేను మూఢుడనై నీ మహత్త్వమును తెలిసికొనలేక యింతవఱకు కాలమును దురుపయోగ మొనర్చితివి. కనుక నాయందు కృప జూపి నిన్ను భజించు శక్తి ఉత్సాహములను, నీ భక్తులతోడి సాంగత్యముచేయు భాగ్యమును కలుగజేయుము" యని నిరంతరమును ప్రార్థనలు చేయుచున్నచో తప్పక భగవద్భక్తి గలుగును.

ఇదివఱకు నీవు అనుభవించిన విషయభోగము లన్నియును అనిత్యములైనవియు, అజ్ఞానమును, దుఃఖమును, బంధమును పెంచునవియు నగుటచేత వాటి నన్నిటిని యిప్పుడు నీవు విషముగా, దుఃఖప్రదమైనవిగా భావించుచు సజ్జన సాంగత్యమును, భగవన్నామ స్మరణ ధ్యానములను అమృతముగా తలంచి సేవించుచుండుము.

భగవంతునికి భక్తుడవుగాను, గురువునకు శిష్యుడవుగాను, పెద్దలకు సేవకుడవుగాను తయారుకానిదే నీకు అమృతస్వరూపమైన పరమాత్మసుఖము చేకూరదు.

సంకల్పములతో సుఖపడు స్వభావము నశించవిదే విస్సంకల్ప సుఖామృతము లభించదు.



ప్రశ్న : మీకు అంతటను పరమాత్మ కనబడుతుంటే నాకు కనబడదేమి?

ఉత్త. : నీవు ఈ నామరూప ప్రపంచమును చూడవలెనను, తెలిసికొనవలెనను, సంపాదించవలెనను అభిలాషలను, భ్రాంతులను, కోరికలను, సంకల్పములను నశింపజేసికొననిదే అంతటను నిండియున్న పరబ్రహ్మమును గాంచజాలవు.

జనన మరణములకు, అహంకార మమకారములకు, ఆకలి దప్పికలకు, లాభ నష్టములకు, సుఖ దుఃఖములకు, ఆరోగ్య యనారోగ్యములకు, స్తుతి నిందలకు. కలిమి లేములకు, శత్రుత్వ మిత్రత్వములకు, శీతోష్ణములకు, సంకల్ప వికల్పములకును చలించక పరమాత్మను ధ్యానించుచున్నచో నానాభేదములుగా కనబడుచున్న ప్రపంచ దృష్టి నశించి ఏకైక పరమాత్మదృష్టి సంప్రాప్తించును.

ప్రశ్న : భగవంతునకు నామరూపములు లేవనియును, ప్రపంచమే నామరూపములుగా నుండుననియును పెద్దలును, శాస్త్రములును చెప్పుచుండగా మీరు నామరూపములను కల్పించి దేవుని భజించుమనెదరేల?

ఉత్త : నిజముగా పరమాత్మకు నామరూపములులేవు. అయినప్పటికివి తాను సృష్టించిన లోకములను పరిపాలించుటకుగాను నామరూపములను పొందియున్నాడు.

భగవంతుడు ఐదు విధములుగా ఆవిర్భవించెనని పెద్దలు చెప్పిరి. ఎట్లన,

(1) పర — అనగా వైకుంఠమందున్న మహావిష్ణువు. (2) వ్యూహ—అనగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధభేదంబుల, సృష్టి స్థితి లయముల జేయునట్టి పరబ్రహ్మము. (3) హార్ద— అనగా సర్వజీవుల అంతర్యామియై క్రీడించు వాసుదేవ స్వరూపము. (4) విభవ — అనగా దుష్టశిక్షణ, శిష్టపరిపాలనార్థము భగవంతుని దశావతారములు. (5) అర్చ — మనుష్యులందరికిని విగ్రహరూపముగా వెలయుటయు నగును,

శ్లో. నతే రూపం న చాకారో నాయుధాని న చాస్పదం
తథాఽపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే.

తా. ఓ సర్వేశ్వరా ! నీకు రూపము లేదు, ఆకారము లేదు, ఆయుధములు లేవు, స్థానమును లేదు, అయినప్పటికిని నీ భక్తుల కొఱకు నీవు పురుషుని రూపముగా కనబడుచున్నావు.

శ్లో. నిర్గుణం చేంద్రియాతీతం నిరాకారం నిరంజనం
స్వభక్తరక్షణార్థాయ జాయతేహి యుగేయుగే.

తా. భగవంతుడు సత్త్వ రజ స్తమో గుణములు లేనివాడు. ఇంద్రియములు లేనివాడు. నిరాకారుడు. నిర్వికారుడును అయినప్పటికిని



తన భక్తులను సంరక్షణజేయుట కొఱకు ఆ యా కాలములందు (ప్రతి యుగమందును) పుట్టుచున్నాడుగదా ! (రాజయోగరత్నాకరము)

బొగ్గు యను లేక అగ్గిపుల్ల యను ఉపాధిని ఆశ్రయించనిదే మనకు అగ్ని లభించనట్లు, విగ్రహరూపమును లేక గురురూపమును ఆశ్రయించి భజించనిదే నిర్గుణపరమాత్మ మనకు అనుభవమునకు రాడు.

సగుణారాధన చేసినచో దేవతలు సంతుష్టులై మనదేహమునకు కావలసిన ఆయు రారోగ్య అన్నవస్త్రాదులను గలిగింతురు. నిర్గుణారాధన చేసినచో సద్గురువులు సంతుష్టులై శాశ్వతమైన పరమాత్మ సుఖమును కలిగించెదరు.

సగుణారాధన వైదికధర్మముగా చెప్పబడుచున్నది. నిర్గుణారాధన వేదాంతధర్మముగా జెప్పబడుచున్నది.

## భగవంతుని అద్భుత చర్యలు

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

తా. సజ్జనులను (పరమభక్తులను) రక్షించుటకొఱకును, దురాత్ములను శిక్షించుటకును, ధర్మమును నిలబెట్టుటకొఱకును భగవంతుడు ఆ యా కాలములలో అవతరించుచుండును. కనుక భక్తులు ఇతర

మానవాది జీవులను బాధపెట్టక, తమ్ము బాధపెట్టువారికి భయపడక భగవంతు నొక్కనినే నమ్మి నిర్భయముగా, నిష్కామముగా, ఆనందముగా నుండవలెను. బాధపెట్టువారిని తిరిగి బాధపెట్టుచున్నచో భగవంతుని సహాయము దూరమగును. నామ రూప ప్రపంచము నాధారముగా జేసికొనక పరమాత్మను ఆధారముగా జేసికొని యుండు వారి జీవితమే త్వరగా ధన్యమగును.

మ. నగముల్ ధూళిగ ధూళి శైలముగ సంద్రంబు న్విలాస స్థలం
బుగ దెప్పన్ సుగభీరవార్ధిగ దృణంబు న్సార వజ్రాయుధం
బుగ వజ్రంబు దృణంబుగా గను హిమంబు న్వహ్నిగా వహ్ని మం
చుగ గావించెడు నద్భుతాచరణ దక్షు డీశ్వరుం డెప్పుడున్.

తా. అద్భుతాచరణ సమర్థుడనబడు భగవంతుడు పర్వతములను దుమ్ముగా జేయును. ధూళిని పర్వతముగా మార్చును. సముద్రమును అందమైన భూమిగా చేయును. భూమిని సముద్రముగా మార్చును. గడ్డిపరకను గొప్ప వజ్రాయుధముగా చేయును. వజ్రాయుధమును గడ్డిపరకను చేయును. చల్లని మంచును అగ్నిగా జేయును. గొప్ప అగ్నిని (వేడిని) చల్లని మంచుగా మార్చివేయును.

ఆ. తృణము వజ్రమగును దృణమగు వజ్రంబు
దోమ ఏన్గుగున్నతో నెదుర్చు



శశకమైనగాని శార్దూలమును జంపు
దైవయోగ మొకటి దప్పెనేని.

తా. దైవయోగము లేనియెడల గడ్డిపరక వజ్రమగును. వజ్రము తృణమగును. దోమ ఏనుగుతో పోరాడును. లేడి పెద్దపులిని చంపును.

శ్లో. పథి చ్యుతం తిష్ఠతి దిష్టరక్షితం
గృహే స్థితం తద్విహతం వినశ్యతి
జీవత్యనాథోఽపిత దీక్షితో వనే
గృహేఽపి గుప్తోఽస్య హతో న జీవతి.

తా. భగవంతుని అనుగ్రహమున్నచో మార్గముయొక్క మధ్యలో పడిపోయిన వస్తువుకూడ మరల లభించును. దేవుని కృపలేనిచో ఇంటి యావరణలో పడిపోయిన వస్తువైనను వెదకినను దొరకదు. ఇట్లే ఈశ్వరసంకల్ప మున్నచో అడవిలో పారవేయబడిన శిశువు జీవించును. ఈశ్వరానుగ్రహము లేనిచో ఇంటిలో చక్కగా పోషింపబడుచున్న శిశువుకూడ జీవించదు.

ఈశ్వరసంకల్ప ముండుట వలననే అడవిలో పారవేయబడిన శకుంతల మొదట పక్షులచే పోషింపబడుచు, తరువాత కణ్వమహర్షికి దొరకి అభివృద్ధి నొందెనుగదా!

ఇట్లే నాగార్జునాచార్యులు తల్లిదండ్రులచే అడవిలో పారవేయబడినప్పటికిని దైవానుగ్రహ ముండుటవలన ఒక సన్న్యాసికి దొరికెను. తరువాత ఒక ఆశ్రమములో గురువు దగ్గర విద్యల నేర్చి గొప్ప మహనీయుడయ్యెనుగదా! ఈయన పేరుతో నిపుడు నాగార్జునసాగరును నిర్మించిన విషయము లోకవిదితము.

భగవంతుడు శ్రీరామావతారములో సూర్యుని పుత్రుడైన సుగ్రీవుని రక్షించి ఇంద్రుని పుత్రుడైన వాలిని చంపెను. శ్రీకృష్ణావతారములో ఇంద్రుని పుత్రుడైన అర్జునుని రక్షించి సూర్యుని పుత్రుడైన కర్ణుని చంపించెను. శ్రీరామావతారములో శేషుడు తమ్ముడగు లక్ష్మణు డయ్యెను. శ్రీకృష్ణావతారములో శేషుడు అన్నయగు బలరాము డయ్యెను. శ్రీరామావతారములో హనుమంతుని కాపాడెను. శ్రీకృష్ణావతారములో హనుమంతుని అపరావతారమగు భీష్మాచార్యులను చంపించెను. కలియుగములో విష్ణువు గురువుయగు బ్రహ్మముగాను, శివుడు శిష్యుడగు సిద్దయ్యగాను అవతరించిరి. మఱల శివుడు గురువగు శంకరాచార్యులుగాను, విష్ణువు శిష్యుడగు పద్మపాదాచార్యులుగాను అవతరించిరి.

## భగవంతుడు భక్తవత్సలుడు

శ్లో. లక్ష్మీం వా పరిత్యక్ష్యే ప్రాణాన్ దేహమథాపి వా
శ్రీవత్సం కౌస్తుభం మాలాం వైజయంతీ మథాపి వా



శ్వేతద్వీపం చ వైకుంఠం క్షీరసాగరమేవ చ
శేషం చ గరుడం చైవ న భక్తం త్యక్తు ముత్సహే.

తా. "భక్తులను రక్షించుటకుగాను లక్ష్మీదేవినికూడ వదలిపెట్టెదను. ఇట్లే ప్రాణమును, దేహమును, శ్రీవత్సమును, కౌస్తుభమును, వైజయంతి యను మాలికను, శ్వేతద్వీపమును, వైకుంఠమును, పాలసముద్రమును, ఆదిశేషుని, గరుత్మంతుని మొదలగువానిలో దేనినైనను విడిచిపెట్టుదును గాని భక్తుని విడుచుటకు మాత్రము నే నంగీకరించను" అని యమధర్మరాజుతో శ్రీ మహావిష్ణువు చెప్పెను. (స్కాందపురాణము)

"కౌంతేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి"

తా. అర్జునా! నా భక్తుడు చెడడని ప్రతిజ్ఞచేసి చెప్పుము. అని భగవంతుడు చెప్పెను

## దేవుడున్నాడా, లేడా?

శ్లో. నాసతో విద్యతే భావో నా భావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్వదర్శిభిః

తా. ఉన్న వస్తువు ఎప్పుడును యున్నది. లేని వస్తువు ఎప్పుడును లేదు. ఈ రెండింటియొక్క తత్త్వమును బ్రహ్మజ్ఞానానుభవముగల మహనీయులే గాంచి చెప్పుచున్నారు.

జ్ఞానులు అంతటను పరమాత్మనే గాంచుచున్నారు. అజ్ఞానులు పరమాత్మను చూడక అంతటను నామరూపక్రియారూపములైన ప్రపంచమునే గాంచుచున్నారు. పరమాత్మదృష్టిగల వారికి ఎల్లప్పుడును అక్షయసుఖము అనుభవములో నుండును. ప్రపంచ దృష్టితో నున్నవారు సుఖ దుఃఖ, స్తుతి నింద, లాభ నష్ట, శీతోష్ణాది ద్వంద్వములలో బడి ఎప్పుడును నలిగిపోవుచునే యుందురు.

దేవుడున్నా డనుకొనుటయును, లే డనుకొనుటయును మనో వృత్తులే యగును. మనస్సును దాటిన మహనీయులు జీవుడు, ఈశ్వరుడు, జగత్తు యను భేదములను దాటి సర్వాత్మ దృష్టితో మెలగుచుందురు.

దేవుడున్నాడనుకొనుట సాత్త్విక మనోవృత్తి యగును. లేడనుకొనుట తామస మనోవృత్తి యగును. ఉన్నాడో, లేడో యని సందేహము జెందుట రాజస మనోవృత్తి యగును. త్రిగుణములను దాటినవారు తమ ఆత్మకంటె అన్యమేమియును లేదను అఖండానుభవములో నుందురు.

దేవుడున్నాడను విశ్వాసముగలవారు పాపకార్యములకు భయపడి పుణ్యకార్యములందు ప్రీతిగలవారై వర్తించెదరు. దేవునిపై విశ్వాసము లేనివారు దేవుళ్లను, పుణ్యకార్యములను, భక్తులను



సద్గ్రంథములను దూషించుచు పాపభీతి లేనివారై దేహసుఖమున కంటె మించిన సుఖము లేదని తలంచి వర్తించుచుందురు.

దేవుడనగా జగత్ప్రభువనబడును, ఈ ప్రభువు పాపముల జేసిన వారిని దుఃఖములలో ముంచును. పుణ్యకర్మల జేసిన వారిని సుఖములలో ముంచును. కనుక ఈ ప్రభువును భజించుచు పాప దోషములను నశింపజేసికొనిమనలోగల నిర్గుణపరమాత్మను గన్గొనుటకు ప్రయత్నించుచుండుట మానవధర్మమగునను విషయమును మరువరాదు.

మంచు ఒకప్పుడు నీరుగాను, మరొక్కప్పుడు గడ్డగాను కనపడునట్లు దేవుడుకూడ ఒకప్పుడు నిర్గుణుడు ( నిరాకారుడు ) గాను, మరొక్కప్పుడు సగుణుడు (సాకారుడు) గాను అనుభవములో గోచరించుచుండును. మనము రాజస తామస గుణములలో నున్నప్పుడు దేవునకు నామరూపములను కల్పించి భజించుచుండిన మాత్రమే తామస రాజస గుణములవలన గలుగు దోషములను, బాధలను సులభముగా దాట గల్గుదుము. మనము సాత్త్విక గుణముతో నున్నప్పుడు నిర్గుణపరమాత్మయొక్క ప్రకాశాంశము అనుభవములో గోచరించుచుండును. అప్పుడు నిర్గుణాత్మను స్వాత్మనుగా సంభావించుచు, స్థూల సూక్ష్మ కారణ శరీరములను దాటిపోవుటకు ప్రయత్నించుచుండవలెను. అద్వైతాత్మానుభవము గలుగనిదే మనకు దుఃఖనివృత్తి, ఆనంద ప్రాప్తియు చేకూరవు.

కొందరు మనము చేయు పుణ్యము మనలను రక్షించును. మనము చేయు పాపము మనలను శిక్షించును, ఇంతేగాని మనకు సుఖదుఃఖములను గలిగించు కర్త వేరొకడులేడని చెప్పుచుందురు. ఈవిధముగా విచారించినను "కర్మయె నరులకు దేవత; కర్మయె సుఖదుఃఖములకు కారణ మధిపా" అని భాగవతము చెప్పినట్లు కర్మదృష్టితో నైనను కర్మదేవత యొకటి మనపై నున్నదని తెలియుచునే యున్నదిగదా! కనుక స్వేచ్ఛావిహారులము కాకుండ పుణ్య పాప విచక్షణ జ్ఞానముతో ప్రవర్తించిన యెడల క్రమక్రమముగా మానసాదీంద్రిములు స్వాధీనములగును. దీనివల్ల నిర్గుణ స్వరూపమైన నిత్యానంద స్వరూప సాక్షాత్కార జ్ఞానానుభవము గల్గును.

దేవుడనగా ఎల్లవేళలందును సర్వమును తెలిసికొనుచుండువాడు అనబడును. కాలమనునది మనస్సుకంటె వేరుగాదు. అందువలన దేవుడు జాగ్రిదావస్థను, స్వప్నావస్థను, నిద్రావస్థను, సుఖదుఃఖాద్యవస్థలను, కామక్రోధాది గుణములను, జననమరణాది మార్పులను సాక్షిగా నుండి చూచుచున్నాడను విషయము అందరకును తెలిసినదేగదా! మాయా భ్రాంతులకు లోబడి, అల్పసుఖములకు దాసులై, పంచజ్ఞానేంద్రియములకు గోచరించుచున్న జగమే నిత్యమని భావించువారికి దేవుని తత్త్వము తెలియదు.



అజ్ఞానములోనున్న మానవులందరును వారి వారి మనోవృత్తులనే అనుభవించు చున్నారు. అనగా పాపముతో నున్నప్పుడు దుఃఖరూపమైన మనోవృత్తుల ననుభవించుచున్నారు. పుణ్యముతో నున్నప్పుడు సుఖరూపమైన మనోవృత్తుల ననుభవించుచున్నారు. కర్మరహితమైన మహాత్ములు మాత్రమే మనోవృత్తులకు అతీతమైన నిర్గుణపరబ్రహ్మసుఖము ననుభవించుచున్నారు. మనస్సును దాటిన వారికే భగవత్తత్త్వము తెలియును.

# భగవంతు డెక్కడున్నాడు?

## అతని నెట్లు భజించ వలెను?

శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

శ్లో. తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

తా. భగవంతుడనగా శాశ్వతమైన ఆనందస్వరూప మనబడును. అట్టి భగవంతుడు సమస్తజీవులలోను నిండి వెలుగుచున్నాడు. అందువలన మోక్షసుఖము నొందదలంచువారు, భగవద్దర్శనము గావలెనని కోరువారు, పూర్తి దుఃఖ నివృత్తి ఆనందప్రాప్తిని పొంద దలంచు

వారు ఆ భగవంతుని సర్వదా శరణు బొంది యుండవలెను. ఇట్లు చేసినచో ఆ భగవంతుని అనుగ్రహము వలన శాశ్వతమైన శాంతి, సుఖస్థానము లభించును.

ఈ రెండు శ్లోకముల వలన భగవంతుడు అన్ని ప్రాణులలో యున్నాడనియును, ఆయనను శరణు బొందుటయే ఆయనను బొందుటకు భజించే విధానమనియును తెలిసినదిగదా!

ప్రతిదినమును 'రామ, రామ' యని గాని 'శివ, శివ' యని గాని భగవన్నామమును కీర్తించుచుండుటయే, స్మరించుచుండుటయే భక్తి యని తలంచరాదు. అంతరంగములో రాగ ద్వేషములును, అహంకార మమకారములును లేని వారై, సుఖ దుఃఖములకును, స్తుతి నిందలకును చలించక సర్వదా భగవంతుని కీర్తించుటయును, ధ్యానించుటయును నిజమైన భక్తి యనబడును. ఇట్టి భక్తి కలవారే భగవంతునియొక్క మహిమా విశేషములను అనుభవపూర్వకముగా గాంచగల్గుదురు.

భగవన్మహిమలు గోచరించనిచో క్రమముగా భగవంతునిపై గల భక్తివిశ్వాసములు క్షీణించిపోవును.

ఒకకథ: నాస్తికుడగు నొక గొప్ప శాస్త్రజ్ఞుడు తత్త్వవేత్తయు, బ్రహ్మజ్ఞానియు నగు సోక్రటీసుతో "దేవుడన్నవాడు ఎక్కడున్నాడో యని భూమండలమంతయు వెదకితిని. సూర్యమండలమును, చంద్రమండలము, నక్షత్రమండల మంతయు





మిక్కిలి శ్రేష్ఠతరమగు దుర్భిణీయంత్రములతో బారజూచితిని గాని ఎక్కడను దేవుడు కన్పించలే" దనెను.

అపుడు సోక్రటీసు "నీవు మరియొక యంత్రముతో జూచుట మరచితివిసుమా!" అని చెప్పగా ఆ శాస్త్రజ్ఞుడు "ఆ యంత్రమే" మని యడిగెను. అప్పుడా తత్త్వవేత్త, "భక్తివిచారణ, వైరాగ్యము, యనెడి అద్దములను మనస్సనెడి యంత్రమునకు అమర్చి జూచిన యెడల భగవంతుడు తప్పక గోచరించును" అని చెప్పగా ఆ శాస్త్రజ్ఞుడు వానికి శిష్యుడై భగవంతుని యథార్థస్థితి దెలుసుకొని, నిశ్చలానందమున నుండెను.

ఈ కథవలన భక్తి జ్ఞాన (విచారణ) వైరాగ్యములు కలవారికే భగవత్తత్త్వము గోచరించునని తెలియుచున్నదిగదా! కనుక భక్తులైన వారును, మోక్షాపేక్షగలవారును, సన్యాసులైనవారును దేనియందును కోరిక (అపేక్ష) లేనివారై ఆత్మానాత్మ, ధర్మాధర్మ విచారణలు జేయుచు భగవంతుని ఎల్లప్పుడును భజించుచుండవలెను. దీనిచే భగవద్దర్శనము సిద్ధించుటయేగాక లోకములో గొప్ప కీర్తికూడ వ్యాపించును.

ఇతరులలోని గుణములను వెదకుచున్నచో గుణములను భజించుటయే యగును. ఆత్మను వెదకుటయే నిజముగా దేవుని భజించుట యగును.

# పురుషప్రయత్నము - భగవత్ప్రాప్తి

భగవంతునికంటె పురుషప్రయత్నమే మనకు గొప్పది. భగవంతుడు యెప్పుడును యున్నాడు. పురుషయత్నమే ఎల్లప్పుడును వుండుటలేదు. భగవంతుడు లేక మనము చెడిపోవుటలేదు. పురుషయత్నము లేకనే మనము చెడిపోవు చున్నాము. మనలను రక్షించునదియు, మోక్షసుఖము నిచ్చునదియు పురుషయత్నమే యగును. మన యత్నము లేకుండగా ప్రపంచములో నేదియు లభించదు. మన యత్నము లేనిదే యితరు లెవ్వరును మనకు సహాయపడరు. మనవలన యితరులకు ఆనందము కలిగినప్పుడే యితరులు అప్రయత్నముగా మనకు మేలు చేయుచున్నారు.

భూమిని నమ్మి సేద్యము చేయనిదే పంట పండుట లేదుగదా ! యజమానుని నమ్మి సేవచేయనిదే సేవకునకు ధనము నిచ్చుట లేదుగదా ! డబ్బు యివ్వనిదే వర్తకులు మనకు వస్తువుల నిచ్చుట లేదుగదా ! ఇట్లే భగవంతుడుకూడ లంచగాడే యగును. భగవంతుడు కరుణామయుడనియు, భక్తసంరక్షణకంకణధారి యనియు మనవారు వర్ణింతురు. అందువలన భగవంతుడు నిష్కామముగా మనలను రక్షించునని తాత్పర్యము చేసికొనరాదు. గీతలో చూడుడు.



శ్లో. అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహం.

శ్లో. సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ ।
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

ఈ శ్లోకములు కూడ 'ముందు నీవు నాకు సేవచేయుము, నీకు తరువాత నేను సేవచేసెద ననియు, నన్ను యెల్లప్పుడును శరణుపొంది యుండుము తరువాత నీ పాపముల పోగొట్టెద' ననియు చెప్పెనుగదా! పై శ్లోకములలోకూడ పురుషయత్నము లేనిదే దైవకరుణ, మోక్షసుఖమును కలుగవని తెలియుచున్నదిగదా ! మరియు గీత దశమాధ్యాయము 10, 11 శ్లోకములలో 'భక్తితో ఎల్లప్పుడును నన్ను కొలుచుచున్న భక్తులకు నన్నుపొందే యోగము నేను యిచ్చెద ననియు, భక్తుల హృదయములోగల అజ్ఞాన చీకటిని బాపెద'ననియు చెప్పెనుగదా ! ద్వాదశాధ్యాయములో 'నన్ను భజించువారిని మృత్యురూపమైన సంసార సాగరమునుండి తరింపజేసెద'నని చెప్పెనుగదా!

కనుక పురుషప్రయత్నమే మిక్కిలి గొప్పదని తెలిసికొని కాలమును వ్యర్థము చేయక ప్రకృతి విముక్తి కొరకు పాటుపడవలెను. ప్రకృతి ప్రపంచమునకు లోబడక సత్యస్వరూపాత్మను విడువకుండుటయే మోక్షమునకు చేయు పురుషయత్న మగును.

"మనము యివ్వనిదే మనకు లభించ'దను సూత్రమును సర్వదా నమ్మియుండవలెను.

"పురుషకార హీనునకు పరమాత్మ దర్శనము కల్గ" అని శ్రీ వివేకానందస్వామి సెలవిచ్చెను. మహనీయు లందరును, పరమభక్తులందరును పురుషప్రయత్నముతోనే ఆత్మను దర్శించినట్లు, భగవద్దర్శనము నొందినట్లు చరిత్రల వలన తెలియుచున్నది గదా !

ఎండ ( తపన ) తో బాధపడుచున్న మానవుడు నీటితో మునుగగానే చల్లదనము గలుగునుగదా ! ఇట్లే సంసార దుఃఖములో నున్న మానవుడు భగవంతుని ఆశ్రయించినచో దుఃఖము శమించును. నీటిని ఆశ్రయించుట, భగవంతుని ఆశ్రయించుట పురుష ప్రయత్నమేగదా !

దుఃఖములు నశించవలెనని కోరుచున్నారుగాని, దుఃఖములు నశించే ప్రయత్నములు అనేకులు చేయుటలేదు. మహాత్ములు కావలెనని అనేకులు కోరుచున్నారుగాని, అల్పగుణములను వదల లేకనే కాలము గడుపుచున్నారు. శరీరసుఖమును బలిచేయనిదే ఆత్మసుఖము లభ్యము కాదని పూర్తిగా నమ్మినవారు చాలా కొద్ది మందే కనుపించుచున్నారు.



సత్యవస్తువునే మనము సర్వదా శరణుబొంది యుండవలెను. మన శరీరమును మరచి యుండవలెను. శరీరము కూడ ఆత్మగానే గోచరించ వలెను. మనము సర్వపరిపూర్ణులమని ఎప్పటికైనను అనుభవ మొందినప్పుడే మన ప్రయత్నము లన్నియు సఫలత నొందినట్లగును.

మన ప్రయత్నము లన్నియును శరీరసుఖమునకుగాక ఆత్మ దర్శనమునకై యుండవలెను. అప్పుడే మనము అఖండ తపస్సులో నున్నవార మగుదుము. ఆత్మ పంచకోశములకు అతీత మైనదని, అవస్థాత్రయములకు సాక్షియని, దేహత్రయములకు విలక్షణ మైనదని, ఆత్మయే మన నిజస్వరూపమని వూరకే చెప్పుకొనుచు కాలము గడువరాదు. మన ప్రజ్ఞా శక్తి యంతయును, మన బుద్ధిబల మంతయును కామ క్రోధాది గుణములను, స్తుతి నిందలను, సుఖ దుఃఖములను రహితము చేసుకొని ఆత్మదృష్టిని విడువకుండుటలో చూప వలెను. ప్రకృతి దేహమునకును, ప్రపంచమునకును లొంగినవాడు ప్రజ్ఞాహీనుడు, గుణహీనుడు నగును.

దైవపూజలును, భగవన్నామ సంకీర్తనలును, జప ధ్యానములును, ఉపవాస మౌనాది వ్రతములును, గీతాది సద్గ్రంథ పారాయణలును, నిత్యానిత్య వస్తువిచారణయును మొదలైన సత్కర్మలు చేయుటలో గొప్ప విశేషములేదు. సుఖ దుఃఖములకును, స్తుతి నిందలకును,

లాభ నష్టములకును, కామ క్రోధములకును చలించకుండుటయే గొప్ప విశేష మగును.

## దేవుని చూచుట కే యే సాధనల జేయ మనెదరు?

శ్లో॥ మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తస్సంగ వర్జితః
నిర్వైర స్సర్వ భూతేషు యస్సమామేతి పాండవ ॥

తా. పాపకర్మలనుమాని భగవంతునకును, పెద్దలకును యిష్టమైన, సంతోషకరమైన పనులనే చేయుచుండవలెను. భగవంతు డొక్కడే నాకు పరమగతియను దృఢనిశ్చయముతో నుండవలెను. నీ ప్రేమ (ప్రీతి) యంతయును భగవంతుని మీదనే యుండవలెను. భగవంతుని మరుపు గలిగించునట్టి ప్రపంచ (సంసార) విషయములతో సంబంధమును వదలిపేయవలెను. అన్ని ప్రాణులును భగవంతుని స్వరూపములే యను నిశ్చయభావముతో అపకారము చేసినవారియందును క్రోధమును, ద్వేషమును పెట్టుకొనక యుండవలెను. ఈ జెప్పబడిన విధముగా నీవు ప్రవర్తించినచో భగవంతుని పొందగలవు. సాక్షాత్కారము చేసుకొనగలవు.

శ్లో॥ అనన్య చేతాస్సతతంయోమాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్యయోగినః ॥



తా. ఇతర కోరికలను, అభిలాషలను, భ్రాంతులను వదలి రాత్రి బవళ్ళను భగవంతుని తెంపులేకుండగా భజించుచున్నచో తప్ప భగవంతుడు సులభముగా ప్రత్యక్షమై తీరును.

శ్లో॥ యది మాంద్రష్టుకామోపి పరమావేదనాంభజ
యథాశి శుర్యథా భిక్షుర్యథా గోవత్స ఏవచ ॥

తా॥ భగవంతుడనగు నన్ను నీవు చూడగోరితివేని భిక్షుకుడ అన్నము కొరకు ఏవిధముగా ఆవేదన పడునో, తల్లికొరకు శిశువ ఏవిధముగా ఆవేదన పడునో, తల్లియావు కొరకు దూడ ఏవిధముగ ఆవేదన పడునో ఆవిధముగానే నీవు కూడ ఆవేదన పడవలెను

శ్లో॥ సర్వభూత స్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగ యుక్తాత్మ సర్వత్ర సమదర్శనః ॥

తా. సంకల్ప వికల్పములతో నున్న మనస్సును నీవు జయించినచో (నిగ్రహించి యున్నచో) నీలోను, ఇతర ప్రాణులలోను అంతటను నిండియున్న పరమాత్మను నీవు చూడ గలుగుదువు. మనస్సును జయించని వారికి పరమాత్మ కనపడడు.

అనన్య దైవభక్తిగలవారికి రాగ ద్వేషము లుండవు. సామాన్యభక్తులకు రాగ ద్వేషము లుండును గాన ఇతర దేవతలను, ఇతర గురువులను, భక్తులను, ఇతర మతస్థులను విమర్శింతురు. దూషించెదరు కూడ.

మనోసంకల్పము లుండువరకును భగవత్తత్వము బోధపడదు. నామ రూప క్రియలపై గల దృష్టియు ఆసక్తియు నశించి నప్పుడె పరమాత్మానుభవము కలుగును. నిస్సంకల్పుడైనచో నిరాకార పరమాత్మ గోచరించును.

శ్లో॥ తిలేషు తైలం దధినీవ సర్పిరాపస్స్రోతస్స్వరణీషుచాగ్నిః ।
ఏవమాత్మని గృహ్యతేఽసౌసత్యే నైనంతప సాయోఽను
పశ్యతి ॥

తా॥ నువ్వులయందు నూనె యున్నట్లుగను, పెరుగునందు నెయ్యి యున్నట్లుగను, భూమిలోపల జలము యున్నట్లుగను, కర్రలందు రాళ్లయందును అగ్ని యున్నట్లుగను మన హృదయములో పరమాత్మ, దేవుడు నిగూఢముగా యున్నాడు. సత్యము చేతను, తపస్సు చేతను ఆ పరమాత్మను మనము గాంచవలెను.

## సత్యమననేమి? తపస్సననేమి?

శ్లో॥ సత్యమే వేశ్వరో లోకే సత్యేధర్మ స్సదాశ్రితః ।
సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరంపదమ్ ॥

తా॥ సత్యమే దేవుడు. ధర్మము లన్నియును సత్యమును ఆశ్రయించి యున్నవి. సమస్త చరాచర ప్రపంచమునకును మూలము (ఆధారము) సత్యమే యగును. సత్యముకంటె శ్రేష్ఠమైన మోక్ష



పదములేదు. "త్రికాలాబాధ్యం సత్యం" భూత భవిష్యత్ వర్త మాన కాలములయందును, జాగ్రత్, స్వప్న, సుషుప్తుల యందును ఏకరీతిగా నుండునదే, ప్రకాశించునదే సత్యమనబడును,

శ్లో. బ్రహ్మచర్యం తథామౌనం నిరాహారత్వమేవచ ।
అహింసా సర్వతశ్శాంతి స్తపమత్యభి ధీయతే ॥

తా॥ బ్రహ్మచర్యవ్రతము గలిగి వుండుట, మౌనవ్రతములతో నుండుట, ఉపవాసవ్రతములు చేయుచుండుట, ఇతర మానవాది ప్రాణులకు ఏ రూపముగానైనను బాధ గలుగకుండులాగున ప్రవర్తించుట, మానసాదింద్రియములను స్వాధీనములో నుంచు కొని ప్రశాంతస్థితిలో నుండుట తపస్సని చెప్పబడును.

పరమాత్మయందు దృష్టినుంచి జప ధ్యానముల జేయుట సత్య మనియును, పరమాత్మను మరుపు గలిగించునట్టి విషయములలోనికి ఇంద్రియములను పోనీయకుండుట తపస్సనియును చెప్పబడును.

## పరమాత్మ స్వరూపమేది?

శ్లో. ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః ।
మనసస్తుపరాబుద్ధిర్యోబుద్ధేః పరత స్తుసః ॥

తా. దేహముకంటె ఇంద్రియములు సూక్ష్మముగా కనపడు చున్నవి. ఇంద్రియములలో మనస్సు సూక్ష్మముగా కనబడుచున్నది.

మనస్సుకంటె సూక్ష్మముగా బుద్ధి కనపడుచున్నది. ఈ బుద్ధినిదాటి చూచిన యే చైతన్యము మిగులుచున్నదో ఆ చైతన్యమే పరమాత్మ స్వరూపమనబడును.

శ్లో. యేనశబ్దం రసం రూపం గంధం జానాసె రాఘవ
తమాత్మానం పరం బ్రహ్మ సర్వమా పూర్య సంస్థితః ॥

తా॥ రామా! ఏ చైతన్యముతో చెవులద్వారా శబ్దములను తెలుసుకొనుచున్నావో ఇట్లే నాలుకద్వారా రుచులను, నేత్రముల ద్వారా రూపములను, ముక్కుద్వారా వాసనలను తెలిసికొనుచున్నావో ఆ చైతన్యమే నీవు. అదియే పరబ్రహ్మము. అదియే అంతటను పూర్ణముగా నిండియున్నది.

## పరమాత్మ నే యింద్రియముతో చూడవలెను?

శ్లో. ఏష సర్వేషు భూతేషు గూఢోఽత్మా న ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥

తా. పరమాత్మ దేవుడు సమస్త ప్రాణులలోను నిగూఢముగా నుండుటవలన అందరకును కనబడుటలేదు. సూక్ష్మదృష్టిగల జ్ఞానులు మాత్రము సూక్ష్మమైన ఏకాగ్రబుద్ధితో ఆ పరమాత్మను చూచుచున్నారు. కనుక సూక్ష్మమైన (త్రిగుణరహితమైన) సూక్ష్మ ఏకాగ్రబుద్ధికే పరబ్రహ్మము కనబడునని తెలియవలెను.



మరియు "మనసైవేద మాప్తవ్యమ్" అని కఠోపనిషత్తుల లోను, "బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్" అని భగవద్గీత షష్టాధ్యాయము లోను చెప్పబడియుండుటవలనకూడ పరిశుద్ధమైన మనస్సునకు లేక బుద్ధికి పరమాత్మ తెలియబడునని గ్రహించి పరమాత్మను చూడ దలంచినవారు ఎవరి బుద్ధులను వారే పరిశుద్ధము జేసికొని చూచినచో తప్పక పరమాత్మ కనబడును. మురికినీటిలో సూర్యుని ప్రతిబింబము కనబడనిరీతిగను, మురికి వేయబడియున్న అద్దములో ముఖమును చూడదలంచినను కనబడని చందమునను మనశ్శుద్ధి లేనివారికి పరమాత్మ కనబడడు.

పాపకర్మలను చేయకుండుట, పుణ్యకర్మలను నిష్కామ బుద్ధితో చేయుచుండుట, సజ్జన సాంగత్యము చేయుట, నిత్యానిత్య విచారణ, ఆత్మానాత్మ విచారణయును చేయుచుండుట, ఇంద్రియ విషయభోగములపై విరక్తి గలిగియుండుట. ఇంద్రియములను నిశ్చలముగా నుంచుకొనుట, జప ధ్యాన సంకీర్తనలు చేయుచుండుట యును మనశ్శుద్ధి కలుగుటకు సాధనములగును.

## భగవత్ప్రాప్తి - ఉపాయములు

శ్లో. మన్మనా భవమద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥

తా. (1) భగవంతుడ నగు నాయందు మనస్సు నుంచుము. (2) నాయందే భక్తికలవాడవు కమ్ము. (3) నన్నే పూజించుము. (4) నాకు నమస్కారము చేయుము. ఈవిధముగా నన్నే పరమ గతిగా దలంచి నీ హృదయమును నా కర్పించిన యెడల చివరకు నన్నే పొందగలవు అని గీత. 9-వ అధ్యాయం.

ఈ శ్లోకములో భగవంతుని పొందుటకు నాలుగు విధములైన పుణ్యకర్మలు చెప్పబడినవిగదా !

(1) ఊరకయుండుటకంటె దేవతలకును, పెద్దలకును, భక్తులకును నమస్కారములను ప్రతిదినమును చేయుట గొప్పది.

(2) నమస్కరించుటకంటె పూజించుటయు, ఫలపుష్పాదులను సమర్పించుటయు, సేవచేయుటయు గొప్పదగును.

(3) పూజించుటకంటె మనస్సులో స్మరించుచుండుట గొప్పది.

(4) స్మరించుటకంటె బుద్ధితో ధ్యానము చేయుచుండుట గొప్పదగును. ఈ ధ్యానమును ఎడతెగకుండగా చేయుచున్న మాత్రమే అహంకారాది ప్రకృతిగుణములు నశించి స్వస్వరూపాత్మ సాక్షాత్కారజ్ఞానము కలుగును.

మొదటిది : గృహములో శివ రామ కృష్ణాదిదేవతల పటములు, మహనీయుల ఫొటోలును యున్నప్పటికిని, గ్రామములో



దేవాలయము లున్నప్పటికిని, ప్రత్యక్షముగా సూర్యనారాయణుడును, చంద్రభగవానుడును కనబడుచున్నప్పటికిని, సాధువులు భక్తులును ఎదురుగా వచ్చినప్పటికిని మనవారిలో ననేకులు చేతులతో నమస్కారము చేయుటకు కూడ బలహీనులై కనబడుచున్నారు. ఇదొక వింతగా ఉన్నదిగదా !

ఒక భక్తు డిట్లనెను : "ఓ భగవంతుడా ! నా నేత్రములు స్త్రీల అవయవవిశేషముల జూచుటకు పారిపోవుచున్నవి. నా చెవులు రసప్రధానములగు మాటలు మొదలగు వాటిని వినుటకు పారిపోవుచున్నవి. నా మనస్సు స్త్రీలను ఆలింగనముచేయుట మొదలగు విషయములను స్మరించుచున్నది. నా చేతులు మాత్రము నాకు స్వాధీనమై యుండుటచే నీవైపునకు త్రిప్పుచున్నాను. అంతవరకే నీవు అల్పసంతోషివై నన్ననుగ్రహింపుము" అని మొరబెట్టుకొనెను.

ఇంతమాత్రము ప్రయత్నమైనను మనవారిలో అనేకులు చేయక, ఇంద్రియ విషయభోగములలో మునిగి పశువులకంటెను హీనులుగా నున్నారు.

నమస్కారముతో అక్రూరుడు భగవంతునిపొందెనని శాస్త్రము చెప్పెను కదా !

రెండవది : పూజ. ఇది కూడ భగవంతుని పొందుటకు సాధన మగును. ఈ పూజనుకూడ మనవారిలో అనేకులు చేయక మూఢత్వము నొంది యున్నారు.

ఒక భక్తు డిట్లనెను.

శ్లో. విశ్వం త్వదీయం హృదయం త్వదీయం ।
మదీయమేకం తవ పాదపద్మమ్ ॥

తా. ఓ సర్వేశ్వరా ! ఈ జగమంతయు నీదే. నా హృదయము నీదే. కాని నీ పాదపద్మములు మాత్రము నావే.

ఈ విధముగా భగవంతునియందును, పెద్దలయందును పూజ్య భావముగలవారు ఫలపుష్పములను, అన్నవస్త్రములను సమర్పింతురు. దేహముతో సేవకూడ చేయుచుందురు.

మూడవది : భగవంతునిపై మనస్సు నుంచుట యగును. దానినే జప మనియు, స్మరణ మనియు చెప్పవచ్చును.

నిశ్శబ్దమైన స్థలములో ఒంటరిగా కూర్చొని ఉదయము. సాయంత్రము శివ రామ కృష్ణ నారాయణ ఓంకారాది మంత్రములలో నొకదానిని ప్రతిరోజును జపము చేయుచుండవలెను. దీనివలన మనస్సు కామ క్రోధాది దుర్గుణములనుండి విడుదల నొంది పరిశుద్ధమగును.



భోజనాది క్రియలను చేయునపుడు కూడ జపము చేయుట అలవాటు చేసికొనవలెను. ఇతర సంకల్పములు ఎన్ని వచ్చుచున్నను తీవ్రముగా జపమును చేయుచునే యుండవలెను. వాక్కుతో సంకీర్తన చేయుట వాచికజప మనబడును. జపము యొక్క మాధుర్యము ననుభవించువారు దానిని మరల వదలిపెట్టజాలరు. ఇట్టి జపమును కూడ మనవారిలో అనేకులు చేయక అజ్ఞానములో, పాపములో పడి యుంటున్నారుగదా ! అందువలననే ఒక మహాత్ము డిట్లనెను.

శ్లో. నారాయణేతి మంత్రోఽస్తివాగస్తి వశవర్తినీ ।
తథాఽపి నరకే ఘోరే పతంత్యే తే తదద్భుతమ్ ॥

తా. నారాయణ యను భగవంతుని నామము కలదు. ఈ నామమును కీర్తించుటకు, స్మరించుటకు వాక్కు మనస్సులును తన వశములోనే యున్నవి. అయినప్పటికిని ఈ భగవన్నామమును భజించక భయంకరమైన నరకకూపములో జనులు పడుచున్నారు. ఇది ఆశ్చర్యముగా నున్నదిగదా !

ఇదెట్లున్నదనగా,

మిక్కిలి ఆకలితో బాధపడుచున్న మానవుడు తనముందు విస్తరాకులో పెట్టబడియున్న ఆహారమును భుజించక ఆకలిబాధతో చచ్చుటవలె నున్నది.

నాలుగవది : భగవంతునిపై భక్తినుంచుట యగును. దీనినే ధ్యానమని చెప్పవచ్చును. భక్తిలేకుండా జప కీర్తనాదులను చేయుచున్నను ఆనందము కలుగదు. కనుక భక్తి అన్నిటికంటె గొప్పదనబడును. శాస్త్రము గూడ,

"భావయుక్తః పునస్సర్వం అకృత్వాపి విముచ్యతే"

అని చెప్పినది. అనగా దైవభావముతో కూడియున్నవాడు ఇతర పుణ్యకార్యములను చేయకపోయినను మోక్షము నొందు నని తాత్పర్యము. కనుక,

భక్తులారా ! సాధకులారా ! భగవంతుడు చెప్పిన నాలుగు సాధన ధర్మములను అనుష్ఠించి అజ్ఞానము నుండి, దుఃఖము నుండి కామక్రోధముల నుండి, జనన మరణముల నుండి, జీవేశ్వర జగత్తులనెడి భేదము నుండి మనము విముక్తులము కావలెను. అప్పుడే మనజీవితము కృతకృత్యము నొందిన దన జెల్లును.

నామ రూప ప్రపంచ సంబంధమైన క్రొత్త క్రొత్త సుఖములను పొందవలెనని కోరిక ఎల్లప్పుడును దైవసుఖమునే, ఆత్మసుఖమునే కోరుటయును, దానినే పొందుటకు సదా ప్రయత్నించుటయును ముముక్షువుల కర్తవ్యమని మరువరాదు. ఓమ్.





శ్లో. వక్తుం శ్రమో న చాల్పోఽపి శ్రోతు మత్యంత సుందరం
తథాఽపి రామరామేతి న వదంతి దురాశయాః.

తా. పలుకుటకు ( కీర్తించుటకు ) కొంచెమైనను శ్రమ లేదు రామనామము వినుటకు మిక్కిలి శ్రావ్యముగా (సుందరముగా) నుండును. అయినప్పటికిని ఈ మానవులు దురాశలకు లోబడి శ్రీరామా ! శ్రీరామా ! యని పలుకక చెడిపోయెదరేల ?

## పరిపూర్ణదేవుడు - పుణ్యపాపములు

శ్లో. ఈశ్వర స్సర్వభూతానా హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయ న్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా.

ప్రశ్న : స్వామీ ! భగవంతుడు గీతలో
"సర్వస్య చాహం హృది సన్నివిష్టః" అనియు
"సర్వభూతాస్థితం యోమాం" అనియును

చెప్పుట వలన సమస్త భూతములలోను భగవంతుడు సమానముగా నున్నాడని తెలియుచున్నదిగదా ! ఇట్లున్నప్పుడు చెట్లను నరికినపుడు, కూరగాయలను కోసినపుడు, చీమలు మొదలైన పురుగులను చంపినపుడు, కుక్క పశువులు మొదలైన వాటిని కొట్టినపుడు, చంపినపుడు యిట్లే దుర్మార్గులైన మానవులను కొట్టి

ంపినప్పుడు విశేషముగా పాపము కలుగదనియు,
నులను బాధించినను, చంపినను మహాపాపము కలుగు
ప్పుట తప్పుకాదా ? జ్ఞానులకు సేవ చేసినపుడు కలిగిన
సమముగా చీమలు మొదలైన పశువులకు ఉపకారము
ంగదా ?

రము : సోదరా ! నీకు కలిగిన సందేహములు
అనేకులకు కలుగుచునే యున్నవి. దీని తత్త్వము
అనేకులు చెడిపోవుచున్నారు. వీటిని గురించి వివరముగా
కాగ్రబుద్ధితో వినుము.

శక్తులయొక్క న్యూనాధిక్యతల ( ఎక్కువ తక్కువల )
పుణ్య పాప ఫలములు కలుగుచుండునని గ్రహించ
అనగా ఎక్కువగా జీవశక్తులుగల ప్రాణులకు ఉపకారము
క్కువగా పుణ్యము కలుగును. అపకారము చేసినచో
పాపము ప్రాప్తించును.

తక్కువగా జీవశక్తులు గల ప్రాణులకు ఉపకారములు
చేసినచో తక్కువగా పుణ్య పాప ఫలములు సంభ

ధారణముగా మానవులు చేయు కర్మలలో కూడా భేదము
ంచుచున్నాము. మంచిభావములో, దైవభావములో



ఎక్కువగా జీవశక్తులు కలవు. అందువలననే మంచిభావముతో ప్రవర్తించువారు కీర్తివంతులు, పుణ్యాత్ములు, సుఖవంతు లగ చున్నారు.

చెడుభావముగల మానవులలో జీవశక్తు లెక్కువగా ప్రక శించక పోవుట వలన అట్టివారు అపకీర్తి పాలగుచు దుఃఖము లను విం చుచున్నారు.

కామ క్రోధ లోభ మోహాది గుణములు లేనివారు శాశ్వత మైన పరబ్రహ్మభావనతో, సమత్వదృష్టితో, ఆనందముతో నిర్వి కల్ప నిర్వికార హృదయముతో నున్నవారై లోకపావనమూర్తులుగ ప్రకాశించుట మనము చూచుచున్నాము గదా !

జైనమత సిద్ధాంతములో జీవశక్తుల గురించి చెప్పిన వాటి వివరణ నిపుడు వ్రాసెదను.

ప్రతిజీవికిని సాధారణముగా ఉన్న నాలుగు జీవశక్తు లేవనగా : (1) శరీరము. (2) స్పర్శ. (3) శ్వాస. (4) ఆయువు. ఈ నాలుగు శక్తులు మాత్రమే జ్ఞానములేని కూరగాయలు మొదలైన చెట్లకు కలవు.

మానవునకు పది జీవశక్తులు కలవు. అవి యేవనగా : (1) మనస్సు (2) వాక్కు (3) శరీరము (4) శ్వాస

(5) ఆయువు (6) శబ్దము (7) స్పర్శ (8) రూపము (9) రసము అనగా రుచులను కనిపెట్టు శక్తి (10) వాసనలజూచు శక్తి.

క్రిమికీటకాదులకు : శరీరము, స్పర్శ, శ్వాస. ఆయువు. వాగేంద్రియము. రసేంద్రియము యను (ఆరు) జీవశక్తులు కలవు.

చీమాదులకు : శరీరము, స్పర్శ, శ్వాస, ఆయువు, వాగింద్రియము, రసము, గంధేంద్రియము అను (ఏడు) జీవశక్తులు కలవు.

ఈగలు మొదలైనవాటికి : శరీరము, స్పర్శ, శ్వాస, ఆయువు, వాక్కు, రసము, గంధేద్రియము, రూపజ్ఞానము అను (ఎనిమిది) జీవశక్తులు కలవు.

పశువులు మొదలైన వాటికి : కరీరము, స్పర్శ, శ్వాస, ఆయువు, వాక్కు, ముక్కు, ( గంధము ) రూపము, రసము, శబ్ద జ్ఞానముతో తొమ్మిది జీవశక్తులు కలవు.

ఈవిధముగా జీవశక్తుల తత్త్వమును గ్రహించి పుణ్య పాప కర్మల ఫలముల హెచ్చు తగ్గులను గుర్తించి మెలగినవారి జీవితము త్వరగా పావనమగును.

## గీతా భక్తులకు దిగ్దర్శనము

భగవంతుని మరచుటయే అన్ని తప్పులకంటె గొప్ప తప్పు అగును. శాశ్వతానందస్వరూపుడైన భగవంతుని మరచినప్పుడే



మానవుడు తప్పులు చేయుచున్నాడు. ప్రపంచమును భగవంతునికి అన్యముగ గాంచుటలోనే తప్పులన్నియు యిమిడి యున్నవి. తప్పులు చేసినచో వాటి ఫలము దుఃఖ మనుభవించుటయే యని గ్రహించవలెను. తమ తప్పులు తాము వెదకికొని సవరణ జేసికొనక పరుల తప్పులను వెదకి చూపించుట దేవుని ధర్మమునకు విరుద్ధమగును.

" అద్వేష్టా సర్వభూతానామ్ " అనుట వలన ఇతరులపై ద్వేషము, అసూయ, క్రోధము భేదబుద్ధియు కలిగి వర్తించుట తప్పు అగును. అంతయును దేవునిదైయుండగా నాది, నావారు యను కొనుట దేవుని సొమ్మును దోచుకొనుటయే అగును. ఈ శరీరమే మనది కానప్పుడు శరీరముకంటె వేరైనవి మన వెట్లగును ?

" సమశ్శత్రౌ చ మిత్రే చ " అని భగవంతుడు చెప్పినను లక్ష్యపెట్టక అపకారము చేయువారిని, ఉపకారము చేయువారిని భగవత్స్వరూపులనుగా గాంచకుండుట తప్పే యగును.

" తుల్యనిందా స్తుతిర్మౌనీ " అనుటవలన స్తుతి నిందలను సమానముగా గాంచక వాటికి చలించుట తప్పే యగును,

"సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" అనుటవలన దుఃఖనివృత్తికి భగవంతుని ఆశ్రయించక మానవులను, ధనాది వస్తువులను ఆశ్రయించుట తప్పే యగును.

"మన్మనా భవమద్భక్తో" అనుటవలన భగవంతునిపై మనస్సు నుంచి జప ధ్యాన పూజ సంకీర్తనాదులను చేయ కుండుటయు, భగవంతునిపై ప్రీతి నుంచకుండుటయు తప్పే యగును. భగవంతుడు యిచ్చిన శరీరముతో భగవంతునికి సేవచేయ కుండుటయు, భగవంతుని బిడ్డలకు సేవచేయకుండుటయు తప్పే యగును. నిరహంకారముతో, మమకారరాహిత్యముతో, స్వార్థ పరిత్యాగముతో సంచరించక కామ క్రోధ లోభ గుణములతో లోకములో సంచరించుటకంటె మౌనముతో బండరాయివలె ఒకేచోట నుండుటయే మంచిది.

సమస్త సంకల్పములు నశించువరకును, సమస్త నామ రూప ప్రపంచమును భగవత్స్వరూపముగా గాంచు శక్తి కలుగువరకును, యితరులచేత సేవ చేయించుకొనక యితరుల వస్తువులను స్వీకరించక దేవునకును, యితరులకును సేవచేయుచు జీవించుటయే భగవత్ప్రాప్తిని కోరుచున్న భక్తుల ధర్మమగునని తెలియవలెను. ఉపకారము చేయవచ్చునేగాని అపకారము చేయరాదు. ఇతరులు యిచ్చినదానిని తీసికొనవచ్చునుగాని కోరరాదు. ఇతరులు చేసిన నిందలు పడవచ్చును గాని నిందించరాదు. ఇవ్వవలెనేగాని తీసికొన కోరరాదు. ఇతరులు మనలను భేదముగా జూచినను మనము మాత్రము అభేదముగానే చూడవలెను. మానవుల మనస్సులో మంచి సంకల్పము గాని, చెడు



సంకల్పము గాని యుండును, మానవుల వాక్కు నిందించుచు గాని, పొగడుచు గాని యుండును.

మానవుల శరీరము ( చేతులు, పాదములు ) అభివృద్ధిపరచు టకు గాని, నాశమొనర్చుటకు గాని పాటుపడుచుండును. త్రికరణముల యందును అహంభావమును, అభిమానమును నశించినప్పుడే పరమా నంద పరబ్రహ్మానుభవము సాధకులకు లభించినట్లు ప్రత్యక్షమగును. గీతాధర్మము జలమువంటిది. సంసారము అగ్నివంటి దగును. అగ్నిని తాకకుండగా ఉపయోగించుకొనిన మాత్రమే మనకు దానివలన సుఖము గల్గును గదా ! ఇట్లే సంసారములో నున్నను సంసారమునకు మనస్సును అంటించకుండగా ప్రవర్తించిన మాత్రమే మనకు కష్టములు రాకుండ నుండును. జలము మనకు చల్లదనము గలిగించునట్లును, మురికిని పోగొట్టునట్లును గీతాధర్మము కూడ మన మనస్సులోగల దుర్గుణములనెడి మురికిని కడిగివేసి హృదయమును శాంతివంతముగా జేయును. కనుక మనము సంసారాగ్నిని తాకక గీతాధర్మమనెడి గంగాజలమును త్రాగవలెను. స్నానమునుకూడ చేయవలెను. సంసారమనగా పంచజ్ఞానేంద్రియ విషయసుఖములపై గల కోరిక. మమకారము క్రోధము నగును.

పరమాత్మ సుఖముపై ప్రీతిగల పుణ్యాత్ములకు మాత్రమే గీతాధర్మములు అమృతముగా నుండును. సంసారము భయంకర

మైన సముద్రమువలె కనబడును. పరిపూర్ణజ్ఞానము (భక్తి) గలవారికి మాత్రము సర్వమును ఆత్మ (దైవ) మయముగా కనబడును గాన భయమునకును, దుఃఖమునకును తావులేదు.

దైవచింతనలో నున్నప్పుడు రెండవ సంకల్ప మేదైన వచ్చుచున్నంతవరకును పరమాత్మ సుఖమును పూర్తిగా అనుభవింపలేమని సాధకులు గ్రహించి మెలగవలెను. దైవచింతనతోను, నామరూప ప్రపంచ మంతయును మిధ్యయను దృఢమైన వైరాగ్యముతోను మనస్సును బాహ్యవిషయములకు అంటనీయక చేసికొనుటయే సాధకులు చేయవలసిన ముఖ్యకర్తవ్య మగును. కర్మలతో ఆనందించువారికి పాపదోషములు, అశాంతి, కలహములును వచ్చుచునే యుండును. ఒక్క దైవచింతనతోనే ఆనందించువారికి పుణ్యాపాపములకు అతీతమైన బ్రహ్మానందపదము లభించి తీరును. దైవచింతనతోనే తృప్తినొందలేనివారి బాహ్యేంద్రియములు ప్రపంచ విషయములలో సుఖపడుటకు పరుగు లిడుచుండును. పంచ జ్ఞానేంద్రియ విషయములను నిగ్రహించలేనివారికి అనేక తిప్పలు రాక తప్పవు. దైవచింతనతో నున్నవారి కన్ననో అపుడపుడు ఇతర సంకల్పములు వచ్చి కొంత చీకాకు మాత్రమే పెట్టి పోవుచుండును. బాహ్యవిషయములపై ఆసక్తి నుంచక భగవంతు నొక్కనినే నమ్మి భజించువారు నిస్సంశయముగా సులభముగా అజ్ఞాన చీకటిని, సంసార దుఃఖమును తప్పక దాటిపోవగలరు.



మంచి చెడ్డలను వర్ణించువారికిని, మంచి చెడ్డలకు చలించువారికిని దైవ (ఆత్మ) దృష్టి లేదనియును, ఆత్మసుఖము అనుభవములో లేదనియును గ్రహించవలెను.

ప్రపంచమును (మనస్సును) దాటినవారి భాగ్యమే పరమాత్మ సుఖమగును. శ్రీకృష్ణుని ఉచ్ఛిష్టమగు గీతామృత రుచిని అనేకులు వర్ణించి చెప్పుచున్నారేగాని తినుటలేదు. అందువలననే కామ క్రోధములును, అహంకార మమకారములును, నీవు నేను యను భేద భావములును నశించక దుఃఖపెట్టుచున్నవి.

శ్రీకృష్ణపరమాత్మను అనన్యచింతనతో ఆశ్రయించినవారికి మాత్రమే గీతామృతము హృదయములోపడి దుఃఖమును రూపుమాపును. గీతను చదువుటయును, ఇతరులకు చెప్పుటయును సులభమే గాని గీతామృతమును పానముచేయుట మిక్కిలి కష్టమైన పనిగా కనబడుచున్నది.

భక్తి వైరాగ్యములు గల వారికి మాత్రము గీతాధర్మాచరణ మిక్కిలి సులభముగా నుండును. ప్రపంచముపై, దేహముపై గల మోహమే గీతామృతమును త్రాగనీయక జేయుచున్నది, భగవంతునిపై విశ్వాసములేని బ్రతుకు బ్రతుకు కాదు. ఇంద్రియములను నిగ్రహించని సాధువు సాధువు కాదు. అంతటను నిండియున్న పరమాత్మను

అఖండదృష్టితో గాంచని జ్ఞాని జ్ఞాని కాడు. సంకల్పములతో నున్న యోగి యోగి కాడు. త్యాగబుద్ధిలేని గృహస్థుడు గృహస్థుడు కాడు.

శ్రీకృష్ణుని ఉచ్చిష్టమును అర్జునుడు, ఉద్ధవుడు, అక్రూరుడు మొదలైన వారు అనుభవించి ధన్యులైరి. మనముకూడ శ్రీకృష్ణ ప్రసాదమును స్వీకరించి అజ్ఞానరోగమును బాపుకొనుటకొరకు గీతా శ్రవణ, మననాదులను చేయుచుండవలెను.

ప్రకృతి రుచికి లోబడిన మూఢులు గీతామృతము యొక్క దివ్యరుచిని అనుభవించక రాక్షసగుణములతో ప్రవర్తించుచున్నారు.

దేహమును, నామ రూప ప్రపంచమును అనిత్యమైనవని తెలిసి కొని యుండియును వాటితోనే సుఖపడవలెనని ఆరాట మొందుట కన్నులు గలవాడు అగ్నికణములను చూచియు కాళ్లు చేతులను వేసి బాధపడుటవలె యున్నది.

నేత్రములను మూసినచో కనబడని విషయములకును, చెవులు మూసికొనినచో వినబడని విషయములకును, భూమిలో కలిసిపోయి కనబడని దేహ ధనాది రూపములకును చలించిన మానవులను కామ క్రోధము లనెడి పిశాచములు పట్టుకొని పీడించు చుండును.

శ్లో. మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ.



తా. భగవంతుడనగు నాకు ప్రియమైన కర్మలను చేయు వారును, నన్నే పరమగతిగా తలంచువారును, నాయందే భక్తి కలవారును, ఏ ప్రాణియందును ద్వేషములేనివారును నగు సద్భక్తులు నన్ను పొందుచున్నారు.

"న శ్రేయో నియమం వినా" అనగా నియమములను అవలంబించి నడువని వారు మోక్షమనెడు శ్రేయస్సును పొందలేరు.

భక్తులలో అనేకులు మనోవాక్కాయములతో పుణ్యకార్యములను చేయుటయే భగవంతునికి ప్రియమైనవని తలంచుచున్నారే గాని మనోవాక్కాయములతో హింసాకార్యములను ( పాపకార్యములను ) చేయకుండుట కూడ దేవునికి ప్రియమైనదని తలంచుటలేదు. ఇది గొప్ప ప్రమాదమే యగును.

గీతాపారాయణ చేయు నియమము, పూజ చేయు నియమము, ప్రార్థన చేయు నియమము, ఉపవాస వ్రతముల జేయు నియమము. గురుసేవ చేయు నియమము. జప ధ్యాన నిష్ఠలను చేయు నియమము. మితసాత్వికాహారభక్షణ చేయు నియమమును కలిగిన వారైనను, ఇతర మానవాది ప్రాణులను బాధించకూడదను నియమమును, ఇతరుల వస్తువులను గాని సహాయమును గాని గ్రహించరాదనెడి అపరిగ్రహవ్రత నియమమును, అబద్ధమాడరాదను నియమమును, దేనియందును ఆశనుంచరాదను నియమమును, నాదియను మమకారము,

నావారు యను వ్యామోహము, నేను యను అహంకారమును ఉండ నీయక చేసికొనవలెనను నియమమును, నీవు నేను యను భేదగుణ ముతో నడువరాదను నియమమును కలిగియుండని వారు నిజమైన భక్తులుగాని, సన్యాసులు గాని కారనియే తలంచవలెను. ఇట్టి వారు భగవంతుని పొందలేరు.

దైవాత్మభావన (చింతన) లోనే నిజమైన సుఖము కలదు. పుణ్యకర్మలు దైవాత్మభావమును వృద్ధిచేయును. పాపకార్యములు ప్రపంచభావములను, రాగద్వేషాది గుణములను, దుఃఖములను వృద్ధి పరచును.

పుణ్యకార్యము లనెడి చిమ్నీని వెలిగించి నప్పటికిని పాప కర్మలు, పాపగుణము లనెడి గాలి తగలకుండుటకై వివేకమనెడి గ్లాసును (అద్దమును) పెట్టకుండుట ప్రమాదహేతువగును.

శుద్ధముగా వస్త్రమును ఉదుకుట పుణ్యకార్యము చేయుట వంటిది. ఆ వస్త్రమును బురదలో, మలములో పడవేసికొనుట పాప కర్మములలోనికి, దుర్గుణములలోనికి ప్రవేశించుటవంటి దగును.

పుణ్యకార్యములనుచేయు శక్తి మాకు ఉన్నది కాని కామ క్రోధాది దుర్గుణములను వదలిపెట్టే శక్తియును, బొత్తిగా పాపకర్మములను మానివేసే శక్తియును మాకు కలుగలేదని కొందరు చెప్పుచున్నారు. ఇదెట్లున్నదనగా దీపమును వెలిగించే శక్తి యున్నది గాని గాలికి



ఆరిపోనీయక కాపాడే శక్తి లేదని చెప్పినట్లును, వంటచేసికొను శక్తి యున్నదే గాని భుజించే శక్తి లేదని చెప్పినట్లును యున్నది.

## చైతన్యమానవు డెక్కువా ?
## జడవస్తువు లెక్కువా ?

శ్లో. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా.

తా. మొదట మానవాది రూపములు లేవు. పుట్టిన తరువాతనే కొంతకాలము కనబడి, నశించిన తరువాత కనబడుట లేదుగదా ! కనుక నిత్యముకాని వాటిని గురించి దుఃఖించుట దేనికి అని భగవంతుడు మనలను ప్రశ్నవేసినాడు.

జడమైన నామరూపముల గురించియే మానవులు దుఃఖము లనుభవించుచున్నారని విచారించినవా రందరకును తెలియుచునే యున్నది.

అజ్ఞానములో ఉన్నవారికి దేవుడు లేడనుట నిజమే. బంధము (దుఃఖము) కలదనుట నిజమే యగును.

జ్ఞానవంతులకు దేవుడున్నా డనుట నిజమే. బంధ మనునది (దుఃఖమనునది) లేదు. మోక్షమే (శాశ్వతానందమే) కలదనుటయు నిజమే యగును.

అజ్ఞానముగల మానవులకంటె ధనాది జడవస్తువులే ఎక్కువ అనబడును. అందువలననే చైతన్యవంతులుగా నున్న అజ్ఞాన మానవులు ధనాది జడవస్తువులు నశించినను, నిందాది జడమైన శబ్దములు వినబడినను రాత్రింబవళ్లను ఏడ్చుచున్నారు.

వివేకజ్ఞానము కలవారికి ఆత్మచైతన్యమే గొప్పదిగాను, స్త్రీ ధనాది నామరూప ప్రపంచము మిథ్యగాను అనుభవ మగుటవలన వీరికి దుఃఖము లేదు. ఆనందమే కలదు.

జడమైన దేహమును పోషించుకొనుటకే ధనాది జడవస్తువు లన్నియును సృష్టింపబడినవి. దేహపోషణ ఆత్మజ్ఞాన సాధనలను చేసికొనుటకే విధింపబడినది. జడమైన వస్తువులపై మోహము కలవారికే దుఃఖములు వచ్చుచున్నవి గాని చైతన్యవస్తువును నమ్మిన వారికి, చూచుచున్న వారికి దుఃఖమెన్నడును యుండదు.

మానవులు చైతన్యస్వరూపులై యుండియు స్వల్పమైన జడవస్తువుల గురించి దుఃఖపడుచున్నారు. తన సేవకొరకు జడ వస్తువులు నిర్మింపబడినవే గాని జడవస్తువులకు సేవచేయుటకు చైతన్యముగల మానవుడు నిర్మింపబడలేదు.

జడవస్తువులకు సేవచేయువారే లోకములో దుఃఖముల పాలగు చున్నారు. కనుక చైతన్యోపాసన చేయవలెనేగాని జడోపాసన చేయరాదు.



జడవస్తువులకు దుఃఖపడు మానవుని తెలివి ఎందుకు కాల్చనా ?

చైతన్యవస్తువులందు దృష్టి నిలుచుటలేదే యని దుఃఖపడ వలెనేగాని జడమైన వస్తువు దొరకలేదే, నశించి పోయినదే యని దుఃఖపడుట మూఢుని స్వభావ మగును. జడవస్తువులను ప్రేమించు నదియు, వాటిని గురించి దుఃఖపడునదియు మనస్సే (అంతఃకరణమే) యగును. కనుక మనస్సును జయించుటయే చైతన్యమానవుని ముఖ్యకర్తవ్య మగును.

ధనాది జడవస్తువులతో తాను సేవచేయించుకొనవలెను. తాను పరమాత్మకు సేవచేయవలెను. ఇదే జీవితధర్మ మగును.

పరమాత్మపై ప్రేమదృష్టి నుంచియే జడవస్తువులతో పోషింపబడవలెను. పరమాత్మను మరచి జడవస్తువులపై ప్రేమ నుంచినచో ఆ జడవస్తువులు మానవులను దుఃఖములో ముంచునను విషయమును మరువరాదు.

పంచజ్ఞానేంద్రియములకు గోచరించు విషయము లన్నియును జడమైనవే యగును. కామ క్రోధాది గుణములతోనున్న మనో బుద్ధ్యాదులును జడమైనవే యగును. నిర్వికారమై, నిర్వికల్పమై సత్య జ్ఞానానందమైన పరమాత్మయే చైతన్య మనబడును.

# కర్మల నెవరు చేయవలెను? ఎవరు వదలవలెను?

శ్లో. ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే
యోగారూఢస్య త స్యైవ శమః కారణ ముచ్యతే." గీత.

ప్రారంభదశలో నున్నవారు మొదట మనోవాక్కాయములతోను, ధన ధాన్య అన్న వస్త్రాదులతోను, దైవార్పణ బుద్ధితోను పుణ్యకార్యములను చేయుచుండవలెను. ఈ నిష్కామ పుణ్య కార్యముల జేయుట వలన మానసాదీంద్రియములు శుద్ధములగును. హృదయము శుద్ధమైన తరువాతనే ధనాది వస్తువులపైని, సంపాదనాది క్రియలపైని ఆసక్తి నశించి అంతరదృష్టితోను, పరమాత్మచింతన ధ్యానములతోను తృప్తిపడుచు ఆనందించునట్టి దశలు కలుగును. ఈ దశలో నున్నవారు బాహ్యకర్మలను చేయరు. చేయవలెనను యిచ్ఛ కలుగదు. చేయకున్నను దోషముగాని, పతనముగాని కలుగదు. ఆత్మవిచారణ, పరమాత్మచింతనలే గొప్ప పుణ్యకర్మ యనబడును.

చాలాకాలము నుండి పనులను చేయక యున్నవారు యిపుడు పనులను చేయుచు ఆత్మపరీక్ష చేసికొను చుండవలెను. ఇట్లే చాలా కాలము నుండి పనులతోనే కాలమును గడుపుచున్నవారు ఏ పనినీ





చేయక మౌనముతో కూర్చొనియుండి ఆత్మపరీక్ష చేసికొను చుండవలెను. మరియు

ఏకాంతమున నివసించువారు జనసంఘములోనికి వచ్చి నివసించవలెను. జనసంఘములో నున్నవారు ఏకాంత ప్రదేశమున నివసించవలెను.

మెత్తని దూదిపరుపులపై పరుండువారు కటిక నేలపై పరుండవలెను. కటిక నేలపై పరుండువారు మృదువైన దూది పరుపులపై పరుండవలెను.

రుచికరమైన, విలువగల పదార్థములను భుజించువారు విలువ తక్కువగల పదార్థములను భుజించు చుండవలయును. విలువ తక్కువ గల పదార్థములను భుజించువారు రుచికరమైన విలువగల పదార్థములను భుజించవలెను.

స్త్రీలను చూడరాదనుకొని దూరముగానున్న పురుషులు స్త్రీల దగ్గర నివసించి చూచుచుండవలెను. పురుషులను చూడరాదనుకొని దూరముగానున్న స్త్రీలు పురుషులదగ్గర నివసించి చూచు చుండవలెను. చాలాకాలము నుండి స్త్రీల దగ్గర నివసించుచున్న వారు పురుషుల సంఘములోనికి వెళ్లవలెను. చాలాకాలమునుండి పురుషుల దగ్గర నివసించుచున్న వాడు స్త్రీల సమాజములోనికి వెళ్ళి యుండవలెను.

అన్నిప్రాణుల యందును, అన్ని స్థలముల యందును పరమాత్మానుభవము గలిగి యుండుటయే విపరిదశ యనబడును. కాన అంతటను పరమాత్మను దర్శించను శక్తిలేని వారు స్థూలమైన ధర్మ సాధనతోగాని, సూక్ష్మమైన ధర్మసాధనతోగాని జీవితకాలమును గడుపుచుండవలెను. జీవుడు, ఈశ్వరుడు, జగత్తు యను ద్వైతము గోచరించుచున్నంత వరకును రాత్రింబవళ్లును మనస్సుతోగాని, బాహ్యేంద్రియములతోగాని సత్సాధనల జేయుచునే యుండవలెను.

జీవుల ఋణము, పితృఋణము, దేవఋణము, గురుఋణము తీరనంతవరకును జీవన్ముక్తులు కాజాలరని పెద్దలు చెప్పుచున్నారు. కర్మల జేయనిదే, సాధనల నభ్యసించనిదే ఋణచతుష్టయమునుండి విముక్తులము కాజాలము. ఋణవిముక్తి కానిదే అమనస్కస్థితి (నిర్వికల్ప సమాధి స్థితి ) లభ్యముకాదు. నిర్వికల్ప సమాధినిష్ఠ సిద్ధించనిదే దుఃఖనివృత్తి, ఆనందప్రాప్తియు సిద్ధించవు.

## బ్రహ్మచారులు - వ్యభిచారులు

"మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ" గీత, అ. 13. శ్లో. 10

శ్లో. మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే

స గుణా న్సమతీత్యైతా న్బ్రహ్మభూయాయ కల్పతే.

గీత, అ. 14. శ్లో. 26



తా. వ్యభిచరించని భక్తితో నన్ను భజించవలెననియు, యిట్లు భజించినవారే జనన మరణ దుఃఖ సంసారమునకు కారణములైన సత్త్వ రజ స్తమో గుణములనుదాటి మోక్షసుఖము నొందుదురని భగవంతుడు చెప్పెను గదా ! కనుక భగవంతునియందు మనస్సును చరింపజేయు వారే ( ఉంచినవారే ) బ్రహ్మచారు లగుదురు. శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయ భోగములకు లోబడినవారే వ్యభిచారులు, వ్యభిచారిణులు అనబడుదురు.

వీర్యమును సంరక్షించుకొనుట 'బ్రహ్మచర్య' మగునని చెప్పుట సామాన్యతాత్పర్య మగును. దైవనిష్ఠగలవారే వీర్యరక్షణ చేసికొన గల్గుదురు. బ్రహ్మ ( దైవ ) భావనలేని వీర్యరక్షణ జ్ఞానవంతుల జేయజాలదు. బ్రహ్మమును ( దైవమును) మరువకుండుటయే నిజమైన బ్రహ్మచర్యమగును.

వ్యవసాయము చేయు ఎద్దులు, దున్నపోతులు, బండిని లాగునట్టి ఆడుగుఱ్ఱములు, మగగుఱ్ఱములు బ్రహ్మచర్యముగానే యుంటున్నవిగదా ! వస్తాదు లనేకులు బ్రహ్మచర్యముగా నున్నారు గదా ! బ్రహ్మభావన లేకపోవుటవలన యీ బ్రహ్మచర్యమువలన జ్ఞాన మేమియు గలుగదు. సాధువులలో, సన్న్యాసులలో, నారీమణులలో ( బ్రహ్మచారిణులలో ) అనేకులు దైవభావన, వైరాగ్యము లేనివారై యుంటున్నారు. ఇట్టి స్త్రీ, పురుషులు పైజెప్పిన ఎద్దులు.

దున్నపోతులు, ఆడుగుఱ్ఱములు, మగగుఱ్ఱములతో సమానమేయగునని జెప్పవచ్చును. లోకసేవకుగాని, దైవనిష్ఠకుగాని ఉపయోగపడని బ్రహ్మచర్యము పేరుమాత్రమే యగును. సంవత్సరమున కొక బిడ్డను కనుచున్న గృహస్థులలో అనేక స్త్రీ పురుషులు బ్రహ్మచారుల కంటె, సన్న్యాసులకంటె అనేక రెట్లు దైవభావముతో, సత్య ధర్మప్రవర్తనలతో, నిత్యానిత్యవస్తువివేకదృష్టితో, విరక్తితో నున్న వారు కనబడుచున్నారు. వారు లోకసేవకూడ చేయుచున్నారు.

కనుక వీర్యరక్షణలోనే గొప్పతనము గలదని యెంచక మేము బ్రహ్మచారులమనియును. బ్రహ్మచారిణులమనియును, సన్న్యాసుల మనియును, విద్వాంసులమనియును గర్వపడక బ్రహ్మభావనతోను, దైవస్మరణతోను, వైరాగ్యముతోను, లోకసేవాది సత్కర్మలతోను జీవితమును గడుపుటయే శ్రేష్ఠమైనదని నిశ్చయించుకొని ప్రవర్తించు వారే ధన్యాత్ములు, సుఖవంతులు, జ్ఞానవంతులు నగుదురని మరువరాదు. దైవనిష్ఠచేయక, వైరాగ్యముతో నుండక, లోకసేవాది సత్కర్మల గావించక, మోక్షప్రాప్తికి ప్రయత్నించక నున్న బ్రహ్మచారులును, సన్న్యాసులును, పండితులును భూమికి భారముగా నుండుటయేగాని ప్రయోజనములేదు.

బ్రహ్మభావనలోనున్న పుణ్యాత్ములు ఇతర పనుల నేమియును చేయకున్నను వారు లోకపావనులే యగుదురు. బ్రహ్మ (దైవ)



నిష్ఠలో గొప్ప మహిమకలదు. బ్రహ్మభావనలో నున్నవారికే దాని అత్యద్భుత మహిమ గోచరించును. దైవభావనగలవారు దేవునితో సమానులే యగుదురు. ప్రపంచభావములో సంకుచితదృష్టి యుండును. బ్రహ్మభావనలో అనంతమైన విశాలదృష్టి యుండును. విశాల దృష్టిలోనే మోక్షసుఖము గలదు. సంకుచితదృష్టిలో క్లేశములే యుండును.

విశాలదృష్టిగలవారే బ్రహ్మచారులు. సంకుచితదృష్టిగల వారే వ్యభిచారులు.

## రంగావధూతగారు ( మచిలీపట్టణము )
## వేమూరి రత్తయ్యగారు ( ఘంటశాల )
### సంవాదము

ప్రశ్న : దేవుడు లేడా ?

ఉత్త. : రూపాయి లేదా ? రూపాయి వుండుటవలననే దానికి పేరు గలిగినది. ఇట్లే దేవుడు కలడు. లేనిచో వాని పేరుండదు.

ప్రశ్న : అందరును ఈ లోక వ్యవహారమును మానినపుడు వీరికి అన్నపానాదు లెచటనుండి వచ్చును ?

ఉత్త. : ఉంటేనేమి, ఊడితేనేమి ? తెగించిన వానికి తెడ్డే లింగము.

ప్రశ్న : మీరు చెప్పే ఆనందము ఈ దేహము విడిచిన తరువాతదిగదా ! ఇప్పు డీ దేహముతో ఎన్నో ఆనందములు పొంద వచ్చునే ?

ఉత్త. : మీరు ఈ దేహముతో పొందెడివి, పొందెద మను కొనెడివి ఆనందములు కావు. భూమండలమునందు అందరికంటె గొప్పవాడు ఎద్వర్డు ప్రభువుగదా ! ఆయనగారి ఆనందము ఒక ఇసుక రేణువనుకుంటే నిర్గుణపరబ్రహ్మమును గనుగొన్నవాని యానందము మేరుపర్వతమంతదని యనుకొనుము.

ప్రశ్న : వివాహమైన పిదప సక్రమముగా గృహస్థాశ్రమము జరిపి తదుపరి పరలోకచింత చేయవలెనని అందురే ?

ఉత్త. : పొరపాటు. ఇవి మనసు కుదరని మాటలు. ఒకనికి దేహమునిండా కురుపులు లేచినవి. స్నేహితులు చూడవచ్చి కురుపు లెట్లున్నవని యడిగినపుడు అన్నిటి కేమిగాని ఈ కురుపే ఎక్కువ బాధగా నున్నదనును.

కొన్నిరోజులకు మరియొకరు వచ్చి యడిగినపుడు ప్రథమ కురుపు మానినను మరియొకదానిని చూపి వెనుకటివలెనే ఈ కురుపే ఎక్కువ బాధగలిగించుచున్న దనును. ఇట్లు యెంతవరకైనను చెప్పు చునే యుండును. కాబట్టి ఎప్పుడూ ఏదో బాధ యుంటూనే యుండును



పెండ్లము లేదు, బిడ్డలు లేరు, ఎవరికివారే యమునాతీరే యని మాయావ్యవహారమును మానవలసినదే.

ప్రశ్న : వెనుక జన్మ లున్నవా ? ముందు జన్మ లున్నవా ? స్వర్గ నరకము లున్నవా ? ఇంద్రుడు, యముడును ఉన్నారా ?

ఉత్త : ఈ విచారణలన్నియు అవసరములేదు. తొందరగా ఇల్లు తగులబడిపోవుచున్నటుల శరీరములు పడిపోవును. కావున తక్షణమే నీవు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనెడి మాయాగుణములను విడిచి సుఖము నొందుము.

కథ : ఒక ధనికుడు కలడు. ఒకనాడు తన పూలతోటలో పందులు పడి తన పూలచెట్లను త్రవ్వుచున్నవి. ఇంతలో ఎవరో వచ్చి యజమానికి చెప్పినారు. అపుడు యజమాని కొందరిని వెంట బెట్టుకొని తోటలోనికి వెళ్లినాడు, కాని వెంటనే పందులను బైటకు తోలక ఈ పందు లెవరివి ? తోటలోనికి ఎట్లువచ్చినవి ? ఏ వైపున కంతలున్నవి ? అని విచారణచేయు చుండెను. ఇంతలో పూల చెట్ల నన్నిటిని పందులు త్రవ్వివేసెను. పందులు ఎట్లు వచ్చిననేమి ? కంత లెచ్చట నున్ననేమి ? ఎవరి పందులైననేమి ? యజమాని వచ్చిన వెంటనే పందులను బైటకు తోలినచో కొన్ని పూలచెట్లు యినను నిలచెడివిగదా ! అట్లు చేయకపోవుటవలన చెట్లు అన్నియు పాడైపోయినవి.

ఇట్లే దేహముండగనే మాయా మమకార భ్రాంతులను విడువవలెననియును, ఆ విచారణ ఈ విచారణల జేయుచు కాలయాపన చేయకూడదనియును, దేహము పోవులోపల మాయా భ్రాంతులను దాటనిచో శాశ్వతానందమును పొందలేమనియును గ్రహించవలెను, ( ఇప్పుడే పుణ్యకార్యములజేసి పుణ్యమును సమకూర్చుకొననిచో రాబోవు జన్మ జీవితము దుఃఖములతో గడచును. )

## విరక్తుల మాటలు - వర్తనలు

ప్రశ్న : పెండ్లిచేసికొనక తిరిగెదవేల ?

రంగావధూత సమా : జాతరలో దిగుట సులభమేగాని గంతులు వేయలేక చావవలెను.

ప్రశ్న : పిల్ల నిచ్చుటకుగాను నేను వచ్చితిని, వివాహమాడుటకు వచ్చెదవా ?

విరక్తుని సమా. : నా జీవితమును దేవునికి, సద్గురువునకు అమ్మివేసితిని గాన వెళ్లము.

ప్రశ్న : భార్యను బిడ్డను వదలి సన్యసించితివేమి ?

రామతీర్థస్వామి సమా. : చిన్న సంసారములో కంటె అందరూ నావారే, అన్నిదేశములు నావే యనెడి పెద్ద సంసార భావనలో గొప్ప సుఖము గలదని సన్యసించితిని.



ప్రశ్న : పెండ్లిచేసికొనియును భార్యతో నుండవేమి ?

జంబుకుమారుని సమా. : నా సద్గురువు దగ్గర ఉపదేశము పొందిన తరువాత నేను స్త్రీని, ధనమును ముట్టనని దృఢనిశ్చయముతో చెప్పుకొంటిని గాన నాకు సంసార భోగములతో పనిలేదు.

సమర్థరామదాసు పెండ్లిపీటపై కూర్చొని యుండి పిల్ల మెడలో తాలిబొట్టు కట్టకుండగనే లేచి వెళ్లిపోయెను, కౌపీనధారియై తపస్సుచేసి శ్రీరామునివలన మంత్రోపదేశముపొంది మహాత్ముడయ్యెను.

సదాశివబ్రహ్మము పెండ్లిచేసికొనియును భార్యను ముట్టక విరక్తితో వెళ్లి తపస్సుచేసి గొప్ప మహాత్ముడయ్యెను. అనేక గ్రంథములను వ్రాసెను.

వడలూరు రామలింగస్వామి వివాహమాడియు భార్యను ముట్టక దైవధ్యానము చేసికొనుచు మహాత్ముడయ్యెను.

## పుణ్యకర్మ ఫలితములు

సీ. శాంత శమ దమంబు సత్యంబు సుగుణంబు
  సిరియు సంపద మంచి శివునిభక్తి
నిర్భయము ఆనంద నిపుణత నిష్కపట
  నీమంబు వ్రతములు నిత్యమానంద

భూతదయా జ్ఞాన పుణ్య దానంబులు
భేదరహితము చాల బీదరక్ష
దేహసౌందర్యంబు తెంపును ధైర్యంబు
పుణ్యకర్మకు ఫలము బుడమి నిదియె

తే. అరరె ! ఈ కపట నాటకం బరసి చూడ
పరగ జన్మంబు నొక్కటే ఫలిత మేరు
అనెడి వాక్యంబు రీతిని అరయు మనగ
ఆత్మనమ్మికతి నారాయణార్య నిన్ను.

## పాపకర్మ ఫలితములు

సీ. గుడ్డి మూగియు కుంటి గుజ్జారితనమును
చెముడు నడ్డియు గూను చిట్టితలలు
యెచ్చి పిచ్చియు వెట్టి యెతిమత పైత్యము
గొడ్రాలు నత్తియు గుబలకమ్మ
మందమతి మూఢత్వ మరుపు వంగియు రంకు
తొట్టి మొఱ్రియు బొల్లి దొంగతనము
కఠినము దుర్మార్గ కపటంబు లీవి గల్గు
పాపకర్మకు లభ్య ఫలిత మిదియు



తే. అరరె ! ఈ కపట నాటకం బరసి చూడ
పరగ జన్మంబు నొక్కటే ఫలిత మేరు
అనెడి వాక్యంబు రీతిని అరయ మనగ
ఆత్మనమ్మికతి నారాయణార్య నిన్ను.

## గీతాశాస్త్రసారము

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.

తా. సమస్తధర్మములను వదలి నన్నొక్కనినే శరణు బొందుము. నేను నీ యొక్క సమస్తపాపములనుండి విడిపించెదను. దుఃఖించకుము.

### వివరణ

ఈ శ్లోకము భగవద్గీతయొక్క సారమంతయును, మోక్షధర్మము యొక్క తత్త్వమంతయును చెప్పుచున్నట్లు గోచరించుచున్నది. మరియు (1) జీవుని స్వరూపమును, (2) ఈశ్వరుని స్వరూపమును, (3) జీవుడు ఈశ్వరుని పొందే ఉపాయ స్వరూపమును, (4) జీవుడు ఈశ్వరుని పొందనీయక జేయుచున్న విరోధి స్వరూపమును, (5) జీవుడు ఈశ్వరుని శరణుబొందియుండుటవలన గలుగు ఫలితమును గురించియును ఈ శ్లోకము చెప్పుచున్నది.

## జీవుడు

"సర్వపాపేభ్యః", "మా శుచః" అనుటవలన ఈ శరీరములోగల జీవుడు అనేక పాపములు కలవాడనియును, దుఃఖపడుచుండువాడనియును తెలియుచున్నదిగదా!

"పురుష స్సుఖ దుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే" అనగా పురుషుడు (జీవుడు) సుఖదుఃఖములను అనుభవించుటకు కారణుడని 13-వ అధ్యాయం 21-వ శ్లోకమునందు చెప్పెనుగదా!

"బుద్ధిస్థః పర ఏవాత్మా జీవాత్మేతి నిగద్యతే" అనగా బుద్ధియందు ప్రతిబింబించిన పరమాత్మయే జీవుడు అను శ్రుతి కలదు. "ఆశాపాశ స్థితో జీవః" అనగా ఈ శరీరములో ఎవడు కోరికలతో నున్నాడో వాడే జీవుడు.

## ఈశ్వరుడెవరు?

"మామేకం శరణం వ్రజ", "మోక్షయిష్యామి" అనుట వలన భగవంతుడు ఏకస్వరూపుడనియును, శరణుబొందువారికి మోక్షమిచ్చువాడనియును తెలియుచున్నదిగదా! "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అనియును, "ఏకం సత్ విప్రాః బహుధావదంతి" అనియును, "ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతమ్" అనియును శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి.



## ఉపాయమేది?

"సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనుట వలన దుఃఖములు పోవుటకు జీవుడు (మానవుడు) చేయుచున్న ఇతరములైన ఉపాయములను (సాధనలను అనగా ప్రయత్నములను) అన్నిటిని పూర్తిగా వదలిపెట్టి ఏకైకస్వరూపుడైన భగవంతుని ఒక్కనిని (శరణు) రక్షకత్వమును పొందుటయే జీవుడు భగవంతుని పొందుటకు సులభోపాయమని తెలియుచున్నదిగదా!

"సర్వధర్మాన్పరిత్యజ్య" అనగా 'ఇతరములైన ఉపాయములను పూర్తిగా వదలిపెట్టి' అని తాత్పర్యము. మనము ఈ తాత్పర్యమును ఆచరణలో పెట్టలేకపోవుటవలననే మనకు మోక్షమును, ఆత్మజ్ఞానమును కలుగకయున్నది. (1) లోకములో కొందరు బాధలు వచ్చినప్పుడే భగవంతుని ఆశ్రయించుచున్నారు, (2) ప్రపంచముపై మోహమును వదలిపెట్టకుండగానే భగవంతుని భజించువారు కొందరు గలరు, (3) జగత్తు మిథ్య, భగవంతుడే నిత్యుడు అని నిశ్చయించుకొని ప్రపంచవిషయములను వదలి భగవంతు నొక్కనినే ఆశ్రయించువారు కొందరు గలరు, (4) జగత్తు నిత్యమనిగాని, అనిత్యమనిగాని తలంచక సమస్తమును భగవన్మయముగా జూచువారు కొందరును కనబడుచున్నారు. ఈ నాల్గవవారే మహాత్ములనబడుదురు.

జీవుడు (మానవుడు) దుఃఖము నశించి ఆనందముగా నెప్పుడును ఉండవలెనని కోరుచు రాత్రింబవళ్లను అనేక ప్రయత్నములు చేయుచున్నాడు. కాని దుఃఖ నివృత్తిని, ఆనందప్రాప్తిని పొందలేకపోవుచున్నాడు. ధన సంపాదనతో దుఃఖము నశించుననియు, దేహాలంకారములతో నానందపడవలెననియు, కామభోగములతోను బిడ్డలను కనుటతోను ఆనందపడవలెననియు, కీర్తిసంపాదనలో సుఖము కలదనియు, దేశాటనలో ఆనందము గలదనియు, రుచిగల ఆహారములను తినుటలో సుఖము గలదనియు, వాహనము లెక్కుటలో సంతోషము కలదనియు, శిష్యులను సంపాదించుకొని సేవ చేయించుకొనుటలో సౌఖ్యము కలదనియును — ఈవిధముగా దుఃఖ నివృత్తికిని, ఆనందప్రాప్తికిని మానవుడు అనేక ఉపాయములను ఆశ్రయించుచున్నాడు. కాని వీటివలన శాశ్వతానందము నొందుట లేదు. శాశ్వతానందము నొందుటకొరకే "మామేకం శరణం వ్రజ" అని భగవంతుడు జీవునికి చెప్పుచున్నాడు.

అశాశ్వతమైనవాటిని శరణుబొందినచో అశాశ్వత సుఖమే కల్గును. శాశ్వతమైన పరమాత్మదేవుని శరణుబొందినమాత్రమే శాశ్వతానందము కలుగును. ఈ తత్త్వమును మానవుడు అనుభవ పూర్వకముగా గుర్తించి మెలగనంతవరకును సుఖము నొందజాలడు.



## విరోధులెవరు?

"సర్వపాపేభ్యః" అనుటవలన పలువిధములైన పాపములే జీవుని (మానవుని) మోక్షసుఖము (ఆత్మసాక్షాత్కార స్థితిని) పొందనీయక జేయుచున్నవి. మానవునిలోగల పాపములన్నియును నశించనంతవరకును మానవునకు అనేక బాధలు వచ్చుచునే యుండును. పాపములే విరోధులు. "జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్ పాపస్య కర్మణః" అనగా పాపములు నశించినప్పుడే మానవునకు ఆత్మజ్ఞానము కలుగును అని తాత్పర్యము. "యావచ్చ పాతకం దేహే తావత్సిద్ధి ర్నజాయతే" అనగా ఎంతవరకు దేహములో పాతక ముండునో అంతవరకును జ్ఞానసిద్ధి కలుగదు అని శాస్త్రసిద్ధాంతము. కనుక కామక్రోధాది గుణములరూపముగానున్న పాతకములే మానవునకు (ముముక్షువునకు) పరమశత్రువులని గ్రహించవలెను. ఎన్నిపాపములు పైబడి కసపిస త్రొక్కినను, ఎన్నిగుణములు పుట్టి హృదయమును అల్లకల్లోలము చేసినను, ఎంతమంది శత్రువులు దేహమును నుగ్గునుగ్గు జేసినను, పరమాత్మ దేవునిమాత్రము శరణు బొందుటయును, స్మరించుటయును మానకూడదు.

## ఫలమేమి?

"సర్వపాపేభ్యః మోక్షయిష్యామి" అనుటవలన సమస్త పాపములనుండియు మోక్షము నొందుటయే పరమాత్మను అనన్య

శరణుబొందినదానికి పరమప్రయోజన మగును. "తరతి శోక మాత్మవిత్" అనగా "స్వాత్మను సాక్షాత్కరించుకొనినవారు దుఃఖమును తరింతురు" అని శ్రుతికూడ చెప్పుచున్నదిగదా!

## సారాంశము

ఈ శరీరములో నెవడు పలువిధములైన పాపములతోను (కామక్రోధాది గుణములతో), దుఃఖములతోను కూడియున్నాడో వాడే జీవుడని గ్రహించవలెను. ఏకస్వరూపుడును, మోక్షమొసంగువాడును, ఎవడుకలడో వాడే భగవంతుడని తెలియవలెను. దుఃఖము పోవుటకును, సుఖము నొందుటకును చేయుచున్నట్టి ఇతరప్రయత్నముల నన్నిటిని వదలి ఏకస్వరూపుడైన పరమాత్మ నొక్కనినే సర్వదా శరణు బొంది యుండుట దుఃఖమును తరింపచేయు ఉపాయమని గుర్తించవలయును. హృదయములోగల పలువిధములైన పాపములే దేవుని భజింపనీయక, దైవామృతమును త్రాగనీయక ప్రపంచభ్రాంతు లనెడి గోతులలోనికి బడద్రోయునట్టి పరమశత్రువులని గ్రహించి దైవసహాయముతో ఆ పాపములనెడి (కామాదులనెడి) శత్రువులను హతమొనర్పవలెను.





సంపూర్తిగా దుఃఖనివృత్తి నొంది ఆనందసాగరమునందు శాశ్వతముగా నోలలాడుటయే భగవత్శరణాగతియొక్క పరమప్రయోజనమని తెలియవలెను. కర్మ, భక్తి, యోగ, జ్ఞాన సాధనలు అన్నియును మోక్షమొందుటతో పరిసమాప్తి నొందుచున్నవి.

## అనిత్యమైనవానిని నమ్మితేనే దుఃఖము కలుగును

శ్లో. గంత్రీవ సుమతీ నాశం ఉదధిః దైవతాని చ
ఫేన ప్రఖ్యః కథంనాశం మర్త్యలోకో నయాస్యతి.

తా. నడుచుచున్న ఈ భూమి, సముద్రములు, దేవతలు అన్నీ నశించును. నీటిపై గలిగే నురుగువంటి ఈ మానవలోకము నశించకుండ ఉంటుందా?

శ్లో. పంచధా సంభృతః కాయో యది పంచత్వ మాగతః
కర్మభిః స్వశరీరోత్థైః తత్రకా పరిదేవనా?

తా. పంచభూతములతో (అనగా మన్ను, జలము, అగ్ని, వాయువు, ఆకాశములతో) నిర్మింపబడిన ఈ దేహము తాను చేసికొనిన పుణ్య పాప మిశ్రమ కర్మలతోగూడి మరణము పొందితే, ఏడ్చుట దేనికి?

శ్లో. సర్వే క్షయాంతా నిచయా
పతనాంతాః సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాంతః
మరణాంతం హి జీవితమ్.

తా. సర్వనామ రూపములును నశించును. గొప్పగా పెరిగిన వన్నియు పడిపోవును. అన్ని సంబంధములును వదలిపోవును. మరణించగానే జీవితము సమాప్తమగును.

శ్లో. శ్లేష్మాశ్రు బాంధవై ర్ముక్తమ్
ప్రేతో భుంక్తే యతోవశః
అతో నరోది తవ్యం హి
క్రియాః కార్యాః ప్రయత్నతః.

తా. పుత్ర మిత్రాది బంధువులు చచ్చినవారిని గురించి ఏడ్చుచు విడుచుచున్న (కార్చుచున్న) చీమిడిని, కన్నీళ్లను ప్రేతము (జీవుడు) విధిలేక త్రాగును కనుక మరణించిన వారిని గురించి ఏడువకూడదు.

## మరణ దుఃఖ ముండరాదు

శ్లో. మా శోకం కురుతా నిత్యే సర్వస్మిన్ ప్రాణ ధర్మణి
ధర్మం కురుత యత్నేన యోవః సహ గమిష్యతి.



తా. ప్రాణము అనిత్యమైనది. సర్వప్రాణులకు మరణించుట నిత్యధర్మమే. కనుక మరణమునకు దుఃఖపడరాదు. చేసికొనిన ధర్మమే మనవెంట వచ్చును. కనుక ధర్మము (పుణ్యము) చేయండి.

శ్లో. మనుష్యేకదళీ స్తంబే నిస్సారో నార మార్గణం
యః కరోతి స సమ్మూఢో జల బుద్బుద సన్నిభే.
(కాత్యాయనుడు)

తా. ఈ మానవ శరీరము అరటిచెట్టు ప్రమానువలె సారము లేనిది. నీటిబుడగ వంటిది. దీనిలో సారమున్నదని తలంచువాడు పూర్తిగా మూఢుడే.

దుఃఖము శరీరమును, మనస్సును కృశింపజేయును. సంతోషము (నవ్వు) ధైర్యమును, ఆరోగ్యమును పెంచును.

## సంసార మను తిరుగలి

శ్లో. భవ దుఃఖ ఘరట్టేన పిష్యంతే సర్వమానవాః
దుఃఖ ముక్తః సదానందః కృష్ణభక్తోహి కేవలః.

తా. సంసారదుఃఖ మను తిరుగలియందు పడి మానవులందరును నలిగిపోవుచున్నారు. కేవలము కృష్ణ భక్తుడు ఒక్కడే ఆ దుఃఖము నుండి విడివడి సదా పరమానందమును పొందుచున్నాడు.

తిరుగలిమధ్య పడిన గింజలు నలుగుచున్నవిగాని మధ్యగురుజు నాశ్రయించిన గింజలు మాత్రము నలుగనట్లు భగవంతు నాశ్రయించిన వారు మాత్రము ఈలోక (సంసార) ములో నలుగుటలేదు.

శ్లో. శాస్త్రం భూరి నిజస్వరూప మతయే స్వారాధనార్థం వపుః
స్వధ్యానాయ మనశ్చ బుద్ధి మనఘాం లంగంచ తీర్థాదికం
తత్వార్థా నుపదేష్టు ముత్తమ గురుం దత్వాను గృహ్ణాతినః
కిం కార్యం తదసి భ్రమే మయదికిం కుర్వీత సర్వేశ్వరః

తా. దయామయుడగు సర్వేశ్వరుడు మనము శాశ్వత పరబ్రహ్మానందము నొందుట కొరకే మానవశరీరమును, వేదాంతశాస్త్రములను, జపము చేయుటకు మనస్సును, పరమాత్మను ధ్యానము చేయుటకు బుద్ధిని, పాపములను పరిహారము చేసికొనుటకు పుణ్యక్షేత్రతీర్థ దేవాలయములను, నీతి ధర్మ భక్తి జ్ఞాన వైరాగ్యములను తెలియజేయు సద్గురువులను ఇచ్చియున్నాడు. వానిని సేవించకుండుట మన తప్పేగాని దేవుని తప్పేమి గలదు ?



# జననము, జీవనము, మరణము

ప్రశ్న : స్వామీ ! ఈ రోజులలో మానవులు సుఖముకంటే బాధలను ఎక్కువగా అనుభవించుచున్నారు. కారణమేమి ?

సమా : అన్నిదుఃఖములకు (బాధలకు, క్లేశములకు) కారణము అధర్మవర్తనలు, అజ్ఞాన గుణభ్రాంతులు నగును.

తల్లిదండ్రులు సత్యధర్మ వర్తనలతో, దయ, శాంతము, భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో నున్నచో మంచిగుణవర్తన, ఆరోగ్యవంతులైన సంతానమును కనెదరు.

తల్లిదండ్రులు మంచివారు కానిచో దుర్మార్గులును, చెడ్డగుణములు గలవారును, రోగులును పుట్టుదురు.

## జీవనము

మనము ఎవరెవరి సహాయములతో జీవించుచున్నామో, వారి వారి ఋణములను తీర్చుచు జీవించుచుండవలెను.

మొదట తల్లిదండ్రులకు బాధ గలిగించక పోషించుచు వారి ఋణమును తీర్చుకొనవలెను.

సూర్య, చంద్ర, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను ; భూదేవి, జలదేవత, అగ్నిదేవుడు, వాయుదేవుడు, ఆకాశము మొదలగు దేవతలను నమస్కారములతోను, పూజలతోను, స్తోత్రములతోను, ధ్యానములతోను సేవించుచు వారి ఋణమును తీర్చుకొనవలెను.

నీతి, ధర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్య విషయములను బోధించుచుండునట్టి ఋషులకును, మహాత్ములకును, సాధుసన్యాసులకును, గురువులకును, పరమభక్తులకును సేవచేసి వారి ఋణములను తీర్చవలెను.

ఎవ్వరికిని ఋణపడనివారే శారీరక బాధలును, మానసిక బాధలును లేనివారై శాశ్వత మోక్షసుఖము నొందెదరు.

## మ ర ణ ము

జననము సాధారణముగా అందరి దృష్టిలో నుండును. కాని మరణము అందరి దృక్పథములో నుండదు.

దైవమును, మరణమును మరువనివారే తొందరగా బ్రహ్మానందానుభవము నొందెదరు.

అనేకమందికి మరణింతుమనియు, మరల కర్మానుసారముగా జననమొందెదమనియు గుర్తులోనుంచుకొని నమ్మకములేకపోవుట



చేతనే చెడ్డపనులు చేయుచున్నారు. నేను, నాది, నావారు యను మమకారములతో బంధింపబడియున్నారు.

లోకములో దరిద్రముతో, రోగములతో, అశాంతితో, కుంటితనముతో, గుడ్డికన్నులతో, అంగహీనతతో బాధలుపడుచున్నవారిని చూచుచును పాపభీతిలేనివారై మమకారమును విడువక ప్రవర్తించు మానవులు మానవులు కారు, రెండు కాళ్ల క్రూరమృగములనియే చెప్పవలెను.

ఈరోజులలో మానవులు ధనమునకు దాసులై, కామభోగవశులై అనేక పాపములు చేసి చెడిపోవుచున్నారు.

దేవుని పైని, సత్య ధర్మవర్తనలపైని విశ్వాసముగలవారే దైవాంశసంభూతు లనబడుదురు.

అల్పసుఖలాభములకు లోబడి అనంతాత్మ సుఖప్రాప్తికి పాటుపడనివారు మూఢు లనబడుదురు.

## పుణ్యమననేది?

దేవుని పూజించుటయును, కీర్తించుటయును, ప్రార్థించుటయును, జపించుటయును, స్మరించుటయును, ధ్యానించుటయును

జీవలోక నాటకమున ప్రతి ఒక్కరు విడువగ రాని పాత్రధారులే ఏ పాత్ర లోపభూయిష్టమైనను నాటకము రక్తి కట్టని వ్యవహారమగును. ఆంగ్లభాషలో 'పర్వతము ఉడుత' అను చిన్న పద్యము ఉన్నది. అదిఒకప్పుడు వాటి మధ్య ఎవరు గొప్ప. వారన్న వాదన లేచినది. పర్యవసానముగ వచ్చిన నీతి ఏమిటంటే ఎవరు వ్యక్తిత్వం వారి కుండుటచేతనే ప్రపంచము రమ్యముగా నడుచుచున్నది. ఇరువురిలో ఎవరు లేకపోయినను ఒక వెలితి కానవచ్చును.

ప్రజ్ఞా పాటవములు వేరుగాని ఆ దేవుడు అందరినీ ఒకేలా సృష్టించాడు. ఇది మావునకు జీవితమున బాధపడవలెను. అనుభవమునకు రావలెను. అపుడు వానికిసర్వులందు సమసామరస్య భావము నెలకొనును. అణుకుత్తప్రేమ, కరుణ అంకురించును. వాని యందు అహంకారము. అణగారును. కాలమును గమనించుము. అది ఒకే గుణమున సాగదు. ఋతువు లను బట్టి ప్రకృతిలో నవరసములు చిల్కు అనేక గుణముల మార్పులు కన్పించును. అవి కల్పము స్థిరముగ నిల్చి సాగుటకు ఏర్పడిన ధర్మములే. అట్లే జీవలోక నాటక రమ్యతకు మానవునందు అన్నిరకముల గుణములు అవసరమే. ప్రతి వ్యక్తికి తన పాత్ర పోషణే ధర్మము. జీవిత కర్తవ్యము. శాంతి సుఖానుభవమే పరమ లక్ష్యము.

ఇక పరమాత్మలేక పరమేశ్వరి యొక్క సుజ్ఞాన తత్వము మానవునకు సిద్ధించుట పరిణామ సూత్రానుగుణమే యగుటందు సత్యము. ఏ పరిణామ సూత్రమున పరమాత్మ నుండి ఈసూక్ష్మరూప నరదేహము సిద్ధించినదో ఆ సూత్రముననే అది మరల పరమాత్మలో చేరిపోవుట సత్యము. అనగా అట్లు దేవునిలో లీనమగుట. అనేక జన్మల ఆత్మల సంస్కార ఫలమే యగును. అంతదకు ఏ జన్మ కాజన్మను మానవునకు తన ఆత్మను పవిత్రము చేయు సుసంకల్పము పట్టుదల ఏర్పడవలెను. అనగా వాడు సర్వజీవులను తనతో సమానముగా చూడ నేర్వవలెను. దానికి దయాదాక్షిణ్యము. నిర్భయము, ధైర్య సాహసములతో కూడిన త్యాగనిష్ఠ. సంఘసేవ, సంఘమందలి కర్తవ్యపాలనలే సత్య జీవిత ధర్మము కావలెను. అచంచల దివ్య మానసమునచియు జీవిలోక సేవయే పరమాత్మయందు భక్తి ప్రపత్తులుగ మారును. జ్ఞాన వైరాగ్యములకు, నిస్సంగత్వమునకు ముక్తికి దివ్య సోపానములు.

నీవు అల్పశక్తి రూపులగు దేవుళ్లను కొలిచి పూజించి ధ్యానించుటలో నీ ధ్యేయమేమి? ఆ దేవుళ్ల యందు నీకంటే ఎక్కువ గొప్ప శక్తులున్నవను తలంపులే కదా! ఆ నిగూఢశక్తులను తదేకముగ ఏకాగ్రత దృష్టిని తలంచుట వాటిని నీ యందు ప్రతిషింపచేయు ప్రయత్నమే అగుట సత్యము. నిజముగ ఆ శక్తులు నీకు కొత్తవి అవన్నియూ నీ హృదయసీమను దాగి సుఖ నిద్ర అచంచల దేవతా భక్తి, ధ్యాన నిష్ఠాశక్తులు అను దివ్య వాతావరణములో ఆ బీజములుమొలకెత్తి వికసించును. ఏకత్వమున ఒప్పె నీ మానవశక్తి అనేకత్వము సాధించును. అనగా





ఆహార మెట్లుండునో మనస్సుకూడ అట్లే యగును. గొప వారు మాత్రము మనస్సుతో ఆహారమును మార్చుకొనెదరు. ఒ భక్తుడు మహమ్మదీయుడు పెట్టిన మాంసాహారమును శాకాహారము మార్చి భుజించినట్లు భక్తవిజయములో కథ కలదు.

సాధారణముగా మంచి ఆహారమువలన మనస్సు మంచి మారును. చెడ్డ ఆహారభక్షణవలన మనస్సు చెడ్డగా మారును.

ఆహారము మంచిదైనను చెడుభావముతో భుజించినచో చెడ ఫలితమే గలుగును.

ఆహారము చెడ్డదైనను మంచిభావముతో భుజించినచో మం ఫలితమే కలుగుటకూడ కద్దు.

సంపాదనలో మంచి చెడ్డలు గలవు. చూచువారలలో మం చెడు చూపులు గలవారు కలరు.

వంటచేయు వారలలో మంచి చెడు భావములుగలవారు కలర

భుజించు వారలలో మంచి భావముతో భుజించువారును, కా క్రోధ భయాది దుష్టభావములతో భుజించువారును కలరు.

చెడ్డవారు తాకిన, చూచిన, సంపాదించిన ఆహారమును భుజిం రాదు.

